హరిః ఓం.

శ్రీ గురుభ్యోన్నమః.

# వర్ణాశ్రమధర్మములు


వావిలాల వెంకటశివావధాని బి.ఏ

పించను సబ్ జడ్జి — మచిలీపట్నము.



మొదటి కూర్పు

1000 ప్రతులు.

మచిలీపట్నము.

శ్రీ నేషనల్ ముద్రణాలయము నందు ముద్రితము.




[వెల రు 0-4-0.


1931.

ఈపుస్తకము దొరకువారు:—

వావిళ్ల వాసుదేవశాస్త్రి,

రామానాయుడు పేట, మచిలీపట్నము, అనివార్యముగ లభించును.

ప్రతి 1 కి 0 4—0.

హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# వర్ణాశ్రమధర్మములు

---

## తొలిపలుకు

'వర్ణాశ్రమధర్మములు' అను వ్యాసమును, అస్మన్మిత్రులును, ఆంధ్రపత్రికాధికారులును, దేశోద్ధారక విశ్వదాతలును, నగు బ్రహ్మశ్రీ మహారాజశ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులగారి కోరికమీఁద నాపత్రికయొక్క సంవత్సరాది సంచికలో ది 1919 సం॥ మే నెల 28 వ తేదీన నేను ప్రకటించితిని. ఇటీవల దానిలోఁ గొన్ని సవరణలను చేసి, కొన్ని క్రొత్త సంగతులను జేర్చి యిపుడచ్చొత్తించితిని.

24—8—1931
మచిలీపట్నము.

వావిలాల వెంకటశివావధాని.

హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# విషయసూచిక





# వర్ణాశ్రమ ధర్మములు



శ్లో॥ నత్వాభగవతేఽజాయ । లోకానాంధర్మసేతవే।
వక్ష్యేసనాతనం ధర్మం । నారాయణ ముఖాచ్ఛ్రితం।
యోఽవతీర్యాఽత్మనోఽంశేన । దాక్షాయణ్యాంతు ధర్మతః।
లోకానాంస్వస్తయేఽధ్యాస్తే । తపోబదరికాశ్రమే।
ధర్మమూలోహి భగవాన్ । సర్వవేదమయోహరిః।
స్మృతంచతద్విదాంరాజన్ । యేనచాఽత్మాప్రసీదతి॥
భాగవతే 7 స్కం 11 అ 5, 6, 7 శ్లోకాః.

## 1 భూమిక

1. లోకధర్మ వ్యవస్థాపకుండును, జన్మరహితుండును నగు నారాయణునకుఁ బ్రణమిల్లి, ఆత్మాంశమున దక్షుని కొమార్తెయగు మూర్తియందు ధర్మునకు నరుతోఁ గూడ నవతరించి లోకక్షేమార్థ మిప్పటికిని బదరికాశ్రమమునఁ దపము సేయుచున్న నారాయణునివలన వినిన సనాతనధర్మమును నారదుఁడు ధర్మరాజునకుఁ జెప్పెను.

సర్వవేదమయుండైన హరిధర్మమునకుఁ బ్రమాణము. వేదవిదులగు మన్వాదుల రూపమునెత్తి శ్రీహరియే ధర్మ వ్యవస్థను జేసెను. ఆమన్వాదుల స్మృతులు ధర్మనిర్ణయ మునఁ బ్రమాణములు. అందువలన నాత్మప్రసన్నమగును. ఆ మన్వాదులగు స్మృతిపురాణేతిహాసకర్తలు కరుణాపరులు, సాధువులు, శాంతులునైన నారాయణపరులు. కాన ధర్మము నితరులకంటె లెస్సగా నెఱుంగుదురనియుఁ గూడ నారదులు సెలవిచ్చిరి. వారందఱకు నమస్కరించి వర్ణా శ్రమ సంగ్రహముఁ జేసెదను. వర్ణాశ్రమ ధర్మములను నహంకార మమకారములు ఫలాభిసంధియు లేక యనుష్ఠించి నచో నవి ప్రవృత్తిరూపము నుండి నివృత్తిరూపముగా మారి మోక్షమునకుఁ బరంపరగా గారణములగునని నార దుఁడు ధర్మరాజునకును, శ్రీకృష్ణుఁడర్జునోద్ధవకుచేలాదులకును సెలవిచ్చిరి. కాన నాధర్మములకుఁ బ్రవృత్తి నివృత్తిరూప ములు రెండు. ప్రవృత్తిరూపములగు ధర్మములను విపులము గను, నివృత్తిరూపములను సంక్షేపముగను మన్వాది ధర్మ శాస్త్రములు నిరూపించును. పురాణాదులలో నివృత్తి ధర్మము ప్రాధాన్యముగా వర్ణింపఁబడును.

—o—

## 2 ఆర్యదేశాచారములు

2. హిందూస్థానమగు భారతవర్షమునకు వాయు వ్యమూల నుత్తరహిందూస్థానమునకుఁ జాలకాలము క్రింద

వచ్చి యక్కడ నివసించిన వా రార్యులనియు, వారే వర్ణాశ్రమ ధర్మముల నేర్పరచి నట్టిప్పటి చరిత్రకారులును, దివ్యజ్ఞానులును దలంచిరి. మన్వాది ప్రాచీనస్మృతులలోఁగూడ నాయూహ నిరాకరింపఁబడినట్లు దోఁచదు. ఆర్యులనఁ బూజ్యులు. వారియాచారములు మంచివి కాన వారి కాపేరు గలిగెను. వారుండెడి దేశమే యార్యావర్తన మనబడును. ఆర్యులను మ్లేచ్ఛులాక్రమించుకొని బాధపెట్టినను దిరిగితిరిగి యాదేశమును వదలక పుత్రపౌత్ర పరంపరగ నార్యులు వానియందే జన్మించిరి. కాన దానికి నార్యావర్తమని పేరుగలిగెనని మనువుననుసరించి మేధాతిథి వ్రాసెను. మనుస్మృతిలో (మను అ ౨-౧౬, ౨౨) ఆర్యావర్తములోని భాగములును, సరిహద్దులును వివరింపఁబడినవి- సరస్వతీ, దృషద్వతీ నదుల మధ్యనున్న దేశము బ్రహ్మావర్తము. ఇది పుణ్యభూములలో నుత్తమము. దీనిలోనుండు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యములవారికిని సంకరజాతులకును బరంపరగా వచ్చిన యాచార వ్యవహారములు ప్రశస్తములు, దీనికంటె దక్కువ పుణ్యముగలది బ్రహ్మర్షి దేశము. కురుక్షేత్రమను ఢిల్లి మత్స్య (రాజపుత్రస్థాన) దేశము కన్యాకుబ్జము (కనౌజ్) శూరసేనకమను మధురాప్రాంతమునకు నీ నాలుగు దేశములును గలిసి బ్రహ్మర్షి దేశమని పేరు. ఇది యమునా సరయూనదుల మధ్యదేశము. ఈదేశపు బ్రాహ్మణుల యాచార వ్యవహారములుఁగూడ నితరులకుఁ బ్రమాణములుగ నంగీకరింపనగును. హిమవద్వింధ్యలకును సరస్వతియు

నదికిని బ్రియాగకును నడుమనుండు దేశము మధ్య దేశము. పూర్వపశ్చిమ సముద్రములకును హిమవద్వింధ్యలకు మధ్య నున్న దేశమునకు ఆర్యావర్తమని పేరు. కాన మనుస్మృతి ప్రకారము రాజపుత్రస్థానము పాంచాల (పంజాబులోని తూర్పుభాగము) ఢిల్లి, ఆగ్రా, మధుర, ప్రియాగ, కాశీ, పాట్నా గయాదులు గల బంగాళా దేశమువఱకు నుండు నుత్తర హిందూస్థానమంతకు నార్యావర్తమని పేరు. వసిష్ఠ స్మృతి, బోధాయనుల సూత్రముల ప్రకారమును పతంజలి వ్యాకరణ మహాభాష్య ప్రకారమును హిమవంతము, పారియాత్రము, కాలకవనము, ఆదర్శము అనుకొండ లార్యావర్తమునకు వరుసగా నుత్తర దక్షిణపూర్వపశ్చిమ హద్దులు. పారియాత్రము, వింధ్యలోని పశ్చిమభాగమునకుఁ బేరు. కాలకవనము బర్మాకును దూర్పు బంగాళమునకును నడుమ నుండు కొండలు ఆదర్శము పంజాబునకును బెలుచిస్థాను, ఆఫ్గనుస్థానులకును నడుమనుండు సులీమాను కొండలగుంపు. ఆర్యావర్తమన సామాన్యముగ నుత్తర హిందూస్థానమని చెప్పవచ్చును. ఇప్పటి యాదేశాచార వ్యవహారములలో ననేకములు బహుకారణములచే మన్వాది ధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడిన వానికంటెఁ జాలభిన్నములుగ నున్నవి. కాన నవి మన కుపాదేయములు కావు. వింధ్యకు దక్షిణమున నున్న కిష్కింధ, గంధిక శక, యవన, శౌర్య, కాంభోజాదులగు దేశములలోని గ్రామ ఘోషనగరాదులలోఁ గూడ నార్యులు నివసించిరని పాణిని వ్యాకరణభాష్యాను

లలో నున్నది. ఆర్యావర్తము నుండి యీ దేశములున్న దక్షిణహిందూస్థానమున కార్యులలోఁ గొందఱువచ్చి కాపురముఁ జేసిరని తేలును. దీని కనుకూలముగ క్రీస్తుపుట్టుటకు ౫, ౬, శతాబ్దములకు అనగా నేటికి ౨౫౦౦ ఏండ్లకు గ్రిందనున్న బోధాయనులు శిష్టులు (ఆర్యులు) ఉత్తర దక్షిణోభయదేశములందుఁ గలరనియు వారివారి యాచారములు (ధర్మశాస్త్రమునకు విరుద్ధములైనను) శిష్టాచారములు గాన నాయాదేశములయం దంగీకరింపవలసిన దనియుఁ జెప్పి కొన్ని దృష్టాంతము లిచ్చిరి. అవి యేవియనః— వింధ్యమొదలు కన్యాకుమారి వఱకు నుండు పంచద్రావిడ (ఘూర్జర, మహారాష్ట్ర, కర్ణాట, కాంధ్ర, ద్రావిడ) దక్షిణ హిందూదేశములలో నుపనయనముగాని పిల్లవానితోను భార్యతోను బొత్తులో నన్నమును దినుటయు, చల్దియన్నమును (తరవాణి) దినుటయు, మేనమామ మేనత్తకూతులను బెండ్లియాడుటయు నను సదాచారము లనాదిగ వచ్చుచున్నవి. కాన వానిని మన శిష్టులంగీకరించిరి. బొచ్చును అమ్మి జీవించుటయు, భంగును ద్రావుటయు, గుఱ్ఱము, కంచరగాడిద లోనగు వానితో వ్యాపారముఁ జేయుటయు, బ్రాహ్మణాదులు శిపాయికొలువులోఁ బ్రవేశించి కత్తిపట్టుకొని జీవించుటయు, సముద్రయానము చేయుటయు నుత్తరదేశశిష్టు లంగీకరించినారు. కాన వానిని మనము నిందింపఁగూడదు. ఇప్పుడు రైల్లు విమానములు మొదలగు ప్రయాణాది సౌకర్యములు మెండుగా నుండుటచేతను

మన దేశము పరరాజపరిపాలనలో నుండుటచేతను, పర దేశములకు విద్యావాణిజ్యాదుల నిమిత్తమే గిన గాని ధనార్జన, నాగరకత, దేశాభివృద్ధియుఁ గలుగమిని స్వరాజ్య సంపాదనకు ముఖ్యముగ నింగ్లండు మొదలగు దేశములకు నేగి యక్కడనున్న ప్రజలతోడను మంత్రులతోడను నా విషయమై చర్చించుట మిక్కిలియవసరముగనుకను హిందూ స్థానమునందంతటను పైనిచెప్పిన పది యాచారములే గాక యితరాచారములనుగూడ మన మభ్యసింపవలసిన కాలము వచ్చెను. ఈపదింటికిని గౌతముడు సమ్మతింప కున్నను క్రీస్తుపుట్టినవెనుక 14వ శతాబ్దములో నున్నట్టియు శ్రుతి స్మృతివ్యాఖ్యాతయు సర్వజ్ఞుఁడునగు మాధవాచార్యులు పరాశరస్మృతివ్యాఖ్యలోఁగూడ నంగికరించిరి. నేటికిని వాని ప్రచారము మెండుగఁగలదు.



# 3 వర్ణోత్పత్తిక్రమము — జాతినిర్ణయము



3. వర్ణోత్పత్తి సర్వవేదగతమగు పురుషసూక్త ములో నిటులున్నది.

“ బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్, బాహూరా జన్యః కృతః, ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ంశూ ద్రోఅజాయత ” దీనికర్థము భగవంతుఁడు పురుషరూపము నెత్తి సృష్టిఁజేయుటలో ముఖమున బ్రాహ్మణులను, బాహు

వుల క్షత్రియులను, తొడల వైశ్యులను. పాదముల శూద్రులను బుట్టించెను. ప్రాచ్యపాశ్చాత్యులు దీనియర్థము నిట్లు వివరించిరి. విద్యను, దేహబలమును, ఓర్పును, సేవను వరుసగా మోము, భుజములు, తొడలు, కాళ్లు, సూచించును గాన భగవంతుని యవయవములనుండి నాలుగువర్ణములవారె కలిగినట్లు చెప్పఁబడినదని పురుషసూక్తవాక్యమునకు (దాత్పర్యము, అసలుపురు తెలుపు, యెఱుపు, పసుపు, నలుపురంగులుగలవారనియుఁ బురాణములలో) జెప్పఁబడినది. కాన వర్ణమన రంగు. ఈపురుషసూక్తార్థము తైత్తిరీయ సంహితా బృహదారణ్యకోపనిషత్తులలోఁ గూడ నిట్లు వివరింపఁబడినది.

**4.** తై. సం. 7 కాం. ప్ర 1. అ 1.

"ప్రజాపతి రకామయత ప్రజాయేయేతి సముఖతస్త్రివృతం నిరమిమీత తమగ్నిర్దేవతాఽన్వసృజ్యత, గాయత్రీఛందో రథంతరగ్ం సామబ్రాహ్మణో మనుష్యాణా మజః పశూనాం తస్మాత్తే ముఖ్యాముఖతోహ్య సృజ్యంతో, రసో బాహుభ్యాం పంచదశన్నిరమిమీతత మింద్రో దేవతాన్వసృజ్యతత్రిష్టుప్ఛందో బృహత్॥ 4. సామరాజన్యో మనుష్యాణామవిః పశూనాం, తస్మాత్తేవీర్యావంతో వీర్యాధ్యసృజ్యంత మధ్యతస్సప్తదశం నిరమిమీతతం విశ్వేదేవాదేవతా అన్వసృజ్యంత జగతీఛందో వైరూపగ్ం సామవైశ్యో మనుష్యాణాం గావః పశూనాం, తస్మాత్తఅద్యా అన్నధానాధ్యసృజ్యంత తస్మాద్భూయాగ్ంసోన్యేభ్యోభూయిష్ఠావా,

దేవతా అన్వసృజ్యంతపత్త ఏకవిగ్ంశన్నిరమిమీతత మను
ష్టుప్ఛందః॥ 5.
అన్వసృజ్యత వైరాజగ్ం సామశూద్రో మనుష్యాణామశ్వః
పశూనాం తస్మాత్తౌ భూతసంక్రామిణావశ్వశ్చ శూద్రశ్చ
తస్మాచ్ఛూద్రో యజ్ఞేనవక్లృప్తో నహిదేవతా అన్వసృజ్యత
తస్మాత్పాదావుపజీవతః పత్తో హ్యసృజ్యేతాం ప్రాణావై త్రి
వృదర్ధమాసః పంచదశః ప్రజాపతిస్సప్తదశస్త్రయ ఇమే
లోకా అసావాదిత్య ఏకవిగ్ంశ ఏతస్మిన్వా ఏతేశ్రితా ఏతస్మి
న్ప్రతిష్ఠితా య ఏవం వేద తస్మిన్నేవ శ్రయత ఏతస్మి
న్ప్రతితిష్ఠతి॥ 6.

5. దీనికి తెనుగు: —

ప్రజాపతి తనకు సంతానము కలుగుంగాక యని కోరెను. అతఁడు తనముఖమునుండి త్రివృత్తనుస్తోమమును పుట్టించెను. తదనంతరము అగ్నిదేవతను గాయత్రీఛందస్సును రథంతరసామమును మనుష్యులలో బ్రాహ్మణుని పశువులలో మేకనుసృజించెను. ముఖమునుండి పుట్టింపబడినవి గావున నవి ముఖ్యములు. వక్షుస్సునుండియు బాహువులనుండియు పంచదశస్తోమమును పుట్టించెను. దానితర్వాత ఇంద్రదేవతను త్రిష్టుప్ఛందస్సును, బృహత్సామమును మనుష్యలలో రాజన్యుని (క్షత్రియుని) పశువులలో గొఱ్ఱెను సృజించెను. కాబట్టియే అవి బలముఁగలవి. ఎందులకనఁగా బలభాగమునుండి పుట్టినవగుటచే మధ్యభాగమునుండి సప్తదశ

స్తోమము ను అతఁడే పుట్టించెను. తదుపరి విశ్వేదేవులు అను దేవతలను జగతీ ఛందస్సును వైరూపసామమును మనుష్యులలో వైశ్యులను, పశువులలో గోవులను పుట్టించెను. కనుకనవి భోగ్యములు (అనుభవింపదగినవి) ఏలననఁగా భోజన పాత్రినుండి పుట్టినవి కాబట్టి. కనుకనే తదితరులకంటె వీరు మిక్కిలిగ నున్నారు. ఏలనన ననేక దేవతలను విశ్వేదేవ గణమునకుఁ దర్వాత నుద్భవించిరి గనుక. ప్రజాపతి పాదములనుండి ఏకవింశస్తోమము నతఁడు పుట్టించెను. తదుపరి అనుష్టుప్ఛందస్సును వైరాజసామమును మనుష్యులలో శూద్రులను పశువులలో గుఱ్ఱమును పుట్టించెను. కనుకనే గుఱ్ఱము శూద్రుఁడు అను రెండును పరులపై నాధారపడియున్నవి. కనుకనే శూద్రుఁడు యజ్ఞమునకు యోగ్యుఁడు కాఁడు. ఎందులననఁగా నతఁడు ఏ దేవతల తరువాతను బుట్టలేదు. అటులగుటవలన వానికాధారము పాదములే. ఏలనఁగ బ్రజాపతి పాదములనుండి పుట్టినాఁడు గనుకను వీని ననుసరించి చాతుర్వర్ణ్యములయొక్కయు, అనులోమ ప్రతిలోమజాతులయొక్కయు నుత్పత్తిజాతి నిర్ణయమును శీర్షిక క్రింద నీశ్రుతులననుసరించి శ్రీస్కాందపురాణాంతర్గతసూత సంహితీయశివమాహాత్మ్యములోని పండ్రెండవ యధ్యాయమందిటులు వర్ణింపఁబడినది:— నైమిశీయాః

భగవన్సర్వశాస్త్రార్థ పరిజ్ఞానవతాం వర
జాతినిర్ణయమస్మాకం వదవేదైక దర్శితం ॥౧॥
సూతః వక్ష్యే లోకోపకారాయ జాతినిర్ణయమాదరాత్ ।

అగస్త్యోపిపురాపృచ్ఛత్ప్రిణమ్య వృషవాహనం ॥ ౨॥
పురాసర్వేమునిశ్రేష్ఠాః ప్రళయేవిలయంగతే।
అంధకారావృతే లోకేవిష్ణోరంశోమహాద్యుతిః ॥ ౩॥
సహస్రశీర్షాభగవాన్ స్థితోనారాయణాభిధః।
క్షీరాబ్ధౌచింతయన్సృష్టింసుష్వాపబ్రహ్మవిత్తమాః ॥౪॥
కదాచిత్పంకజం విప్రాస్తరుణాదిత్య సన్నిభం।
తస్యసుప్తస్య దేవస్య నాభ్యాం జాతం మహత్తరం ॥౫॥
హిరణ్యగర్భో భగవాన్ బ్రహ్మవిశ్వజగత్పతిః।
ఆస్థాయపరమాంమూర్తింతస్మిన్పద్మేసముద్బభౌ ॥౬॥
తస్యవేదవిదాంశ్రేష్ఠాబ్రాహ్మణాః పరమేష్ఠినః।
మహాదేవాజ్ఞయాపూర్వ్వా సనాసహితాన్ముఖాత్ ॥౭॥
బ్రాహ్మణాబ్రాహ్మణస్త్రీభిస్సహజాతాస్తపోధనాః
తస్యహస్తాత్సహస్త్రీభిజ్జజ్ఞిరేపృథివీభుజః।
ఊరుభ్యాంసహితాస్త్రీభిజ్జాతాః వైశ్యాశ్శివాజ్ఞయా॥
పద్భ్యాంసహోదరాస్సహస్త్రీభిజ్జజ్ఞిరేవేదవిత్తమాః।
స్వస్త్రీషుస్వస్యవేదేసమాగేజాతాః స్వ[illegible] వేత్ ॥౯॥
అపరాసూత్తమా జాతాస్త్వనులోమాః ప్రకీర్తితాః।
ఉత్తమాస్వపరాజ్జాతః ప్రతిలోమ ఇతిస్మృతః ॥౧౦॥
వర్ణస్త్రీష్వనులోమేనజాతస్స్యాదాంతరాళికః।
వర్ణానుప్రతిలోమేనజాతోవ్రాత్య ఇతిస్మృతః॥౧౧॥
బ్రాహ్మణ్యాంసధవాయాంయో బ్రాహ్మణేనద్విజోత్తమాః।
జాతశ్చౌర్యేణ కుండోసావిధవాయాంతుగోళకః ॥౧౨॥
నృపాయాం బ్రాహ్మణాజ్జాతస్సవర్ణ ఇతికీర్తితః।

చౌర్యాదస్యామనేనోద్ధో నామ్నా నక్షత్రజీవనః ॥౧౩॥
వైశ్యాయాం బ్రాహ్మణాజ్జాతస్త్వంబష్ఠో వేద
విత్తమాః। అస్యామనేన చౌర్యేణ కుంభకారోభిజాయతే॥౧౪॥
ఊర్ధ్వనాపితఏవా సౌనామ్నా వేదవిదాంవరాః ॥౧౫॥
శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతో ద్విజాః పారశవస్మృతః।
చౌర్యేణాస్యాం నిషాదోభూన్నామ్నా వేదార్థవిత్తమాః।
దౌష్యంత్యాం బ్రాహ్మణాజ్జాతో నాపితాఖ్యోభవేద్ద్విజాః।
ఆయోగవ్యాంతు విప్రేణ సింగళో నామజాయతే ॥౧౬॥
విప్రాయాం క్షత్రియాజ్జాతస్సూత ఇత్యుచ్యతే బుధైః।
చౌర్యేణాస్యామనేనోద్ధో రథకార ఇతిస్మృతః ॥౧౭॥
క్షత్రియస్త్రీషు వైశ్యేన భోజశ్చౌర్యాద్ద్విజాయతే।
వైశ్యాయాం క్షత్రియాజ్జాతో మాహిష్యోంబష్ఠసంజ్ఞికః॥
చౌర్యేణాస్యామనేనోద్ధో భవేదశ్వికసంజ్ఞికః।
శూద్రాయాం క్షత్రియాజ్జాతో దౌష్యంతాఖ్యోభవేద్ద్విజాః॥
చౌర్యేణాస్యామనేనోద్ధశ్శూలికోభవతిద్విజాః॥
బ్రాహ్మణ్యాం వైశ్యతో జాతః క్షత్తాభవతినామతః
అస్యామనేన చౌర్యేణ మ్లేచ్ఛో విప్రాః ప్రజాయతే ॥౨౧॥
జాతో వైశ్యాన్నృపాయాం యోకులంగో మాగధశ్చసః।
అస్యామనేనచౌర్యేణపుళిందో జాయతేబుధాః ॥౨౨॥
మణికారస్తు వైశ్యాయాం చౌర్యాద్వైశ్యేనజాయతే।
శూద్రాయాం వైశ్యతో జాత ఉగ్ర ఇత్యుచ్యతేబుధైః ॥౨౩॥
అస్యామనేన చౌర్యేణనటకారః ప్రకీర్తితః ॥౨౪॥
శూద్రాద్విప్రాంగనాయాంతు చండాలో నామ...

అస్యామనేన చౌర్యేణ బాహ్యదాసస్తు జాయతే ॥ ౨౫॥
జాతశ్శూద్రేణ రాజన్యాం వైదేహాఖ్యశ్చపుల్కసః।
అస్యామనేన చౌర్యేణ వేలవాఖ్యో౽భిజాయతే ॥ ౨౬॥
జాతశ్శూద్రేణ వైశ్యాయాం భవేద్వర్తనశాలికః।
అనేనాస్యాం భవేచ్చక్రి చౌర్యాద్బ్రహ్మవిదాంవరాః ॥ ౨౭॥
చౌర్యాచ్ఛూద్రేణశూద్రాయాం జాతోమాణవికో భవేత్ ॥
అంబష్ఠాయాం యఉత్పన్నస్సవర్ణేద్విజోత్తమాః।
సస్మృతో యనతకాఖ్యశ్చ ఇతిప్రోక్తో మహాత్మభిః ॥ ౨౮॥
కరణాయాంతువైశ్యేంద్రాన్మహిష్యాఖ్యో౽భిజాయతే।
సతక్షావధకారశ్చప్రోక్తశ్శిల్పీచవర్ధకీ ॥ ౨౯॥
లోహకారశ్చమకారశ్చేతివేదార్థవేదిభిః।
విప్రాయాముగ్రతోజాతస్తక్షన్వృత్తిః ప్రకీర్తితః ॥ ౩౦॥
వైశ్యాయాం తేననిష్పన్నస్సముద్రోనామజాయతే ॥ ౩౧॥
బ్రాహ్మణ్యాంయోనిషాదేనజాతోనాపితసంజ్ఞితః।
నృపాయాంయోనిషాదేనజాతో౽ధోనాపితః స్మృతః॥
విప్రాయాంనాపితాజ్జాతో వేణుకః పరికీర్తితః
రాజ్ఞాయోజనితస్తేనకర్మకారస్సఉచ్యతే ॥ ౩౨॥
ద్విజోత్తమాయాంచౌర్యంత్రాద్యగల్భః ప్రజాయతే।
వైశ్యాయాంతునిషాదేనసునిషాదో౽భిజాయతే ॥ ౩౪॥
బ్రాహ్మణ్యాంమోమునిశ్రేష్ఠావైదేహాత్ప్రజాయతే।
సనామ్నారజకోజ్ఞేయః పండితైః పండితోత్తమాః ॥ ౩౫॥
ద్విజోత్తమాయాం చండాలాద్యః పుమాన్జాయతే భువి।
శ్వపచస్సతువిజ్ఞేయః సర్వశాస్త్రవిశారదైః॥ ౩౬॥

శ్వపచాద్విప్రకన్యాయాం గుహకో జాయతేసుతః।
వైశ్యాయాంసతు చాండాలాజ్జాతో దంతకపోలకః॥ ౩౭॥
అనేవజాతశ్శూద్రాయాం విప్రాక్షత్రియకస్స్మృతః।
ప్రతిలోమాన్నిషాదాఖ్యాశ్శూద్రాయాంయస్తుభైరవః॥౩౮॥
శూద్రాయాం మాగధాజ్జాతః కురుండః ప్రోచ్యతేబుధైః।
నృపయాంమాగధాజ్జాతః ఖనకః పరికీర్తితః॥ ౩౯॥
ఖనకాద్విజకన్యాయా ముత్పలోనామజాయతే।
అయోగవేన బ్రాహ్మణ్యాం చర్మకారః ప్రకీర్తితః॥౪౦॥
విప్రవ్రాత్యాత్తు విప్రాయాం వందేకోనామజాయతే।
క్షత్రవ్రాత్యాన్నృపాయాంతు జలోమల్లశ్చజాయతే॥ ౪౧॥
మల్లాత్తుపిచ్ఛిలాయాంతు నటాఖ్యోజాయతేభువి।
నటాత్కరణసంజ్ఞస్తు కరణాత్త్వష్ట్రిసంజ్ఞితః॥౪౨॥
తేనదప్రిణ ఉత్పన్నో నృపాయాం వేదవిత్తమాః।
వైశ్యవ్రాత్యాత్తు వైశ్యాయాంసుధన్వాజాయతేద్విజాః॥౪౩॥
అనేనచౌర్యాత్సంజాతష్షష్ఠో షష్ఠాదపిద్విజాః।
ద్విజన్మాజాయతే తస్మాన్మైత్రో మైత్రాత్తుతత్త్వతః॥౪౪॥
మైత్ర్యాంవైదేహకాజ్జాతస్స మాతంగశ్చకీర్తితః।
మాతంగాజ్జాయతేసూతః సూతాద్దస్యుః ప్రజాయతే॥ ౪౫॥
దస్యోర్జాతోమునిశ్రేష్ఠాః మాలాకారః సమాఖ్యయా॥ ౪౫॥
ప్రతిలోమనిషాదేన కైవర్తాఖ్యోపి జాయతే॥ ౪౬॥
నీలకారిస్త్రియాం జాతస్త్వయోగేన ద్విజోత్తమాః।
నీలాదివర్ణవిక్రేతా నామ్నా వేదార్థవిత్తమాః॥ ౪౭॥
కారాచారుసమాఖ్యాయాం నిషాదేనమునీశ్వరాః।

చర్మజీవీసముత్పన్న స్వస్వవిజ్ఞానసాగరాః॥ ౪౮॥
యుష్మాకం సంగ్రహేణైవ మయోక్తాజాతినిర్ణయః।
యథాగస్త్యాచ్ఛ్రుతఃపూర్వం మద్గురోరనుశాసనాత్॥ ౪౯॥
స్వజాత్యుక్తం యథాశక్తి కురుతే కర్మయః పుమాన్।
ముక్తిస్తస్యైవసంసారాదితి వేదానుశాసనమ్॥ ౫౦॥
సర్వేషాంజన్మనాజాతిర్నాన్యథాకర్మకోటిభిః।
పశ్వాదీనాంయథాజాతిర్జన్మనై వచనాన్యథా॥ ౫౧॥
సాపిస్థూలస్యదేహస్య భౌతికస్య నచాత్మనః।
తథాపిదేహాహంమానాదాత్మా విప్రాదిసంజ్ఞితః॥ ౫౨॥
స్వస్వరూపాపరిజ్ఞానాద్దేహాభిమానఆత్మనః।
అపరిజ్ఞానమప్యస్య బ్రాహ్మణావేదవిత్తమాః॥ ౫౩॥
ఆదిమన్నభవత్యంతంతస్య జ్ఞానేనసువ్రితాః।
జ్ఞానంవేదాంతవిజ్ఞానమితి సద్గురునిర్ణయః॥ ౫౪॥
యస్యాపరోక్షవిజ్ఞానమస్తి వేదాంతవాక్యజం।
తస్య నాస్తినియోజ్యత్వమితి వేదాంతనిర్ణయః॥ ౫౫॥
వర్ణానామాశ్రమాః ప్రోక్తాః సర్వశాస్త్రార్థవేదిభిః।
తేషాంవర్ణాశ్రమస్థానాం వేదకింకరతాసదా॥ ౫౬॥
అస్తిచేద్ బ్రహ్మవిజ్ఞానం స్త్రియోవా పురుషస్యవా।
వర్ణాశ్రమసమాచారస్తస్య నాస్త్యేవసర్వదా॥ ౫౭॥
అవిజ్ఞాయాత్మవిజ్ఞానం స్వవర్ణాశ్చమనాస్తికాః।
జహాతియస్సమూఢాత్మా పతత్యేవనసంశయః॥ ౫౮॥
తస్మాత్సర్వ ప్రయత్నేన శ్రద్ధయాసహసువ్రితాః।
కర్తవ్యోవర్ణధర్మశ్చ్ర తస్మాత్తూర్ణశ్చముక్తయే॥ ౫౯॥

ఇత్యాకర్ణ్యేమునీశ్వరా శ్రుతిగతం సూతోపదిష్టం పరం
సత్యానంద సుఖప్రకాశ పరమబ్రహ్మాత్మవిజ్ఞానదం।
శ్రుత్వాజాతి వినిర్ణయం సకలలోకాంభోధిపారీంసదా
సత్యాస్తేయదయార్జవాదిసహితాష్టాబభూవుర్భృశం॥

7. దీనికి 'ఆంధ్రసూతసంహిత' లో జాతినిర్ణయమునుగూర్చి, తత్కర్తయగు కొప్పరాజు నరసింగయ్యగారు వ్రాసిన తెనుఁగు:—

క॥ అని కరుణఁబల్కు సూతుని।
మునివర్యులు పూజఁజేసి ముదమలరారన్।
వినయ భయభక్తియుక్తిని।
వినుతించిరి వ్యాసశిష్య విద్యానిలయున్॥

తే॥ ఇట్లు వినుతించి మౌనీంద్రు లెలమితోడ
నమ్రతాచును జాతినిర్ణయము మాకుఁ
దెలుపు"మన సూతుఁడిట్లని తెలుపఁదొడఁగ
సకలజగదుపకారంబు సంఘటిలగ॥

సీ॥ నరకంతు డిదియన్న ఘటజన్మునకుఁ దెల్పె
ప్రళయకాలంబునఁ బద్మనయనుఁ
డంబోధిశయించి యభవుఁజింతింపఁగాఁ
దన్నాభిపంకజ ధామమునను
హైరణ్యగర్భాఖ్యుఁ డజుఁడు జన్మించిన
భూతేశునాజ్ఞచేఁ బూర్వవాస
నావృత్తిఁ దద్వదన భుజోరుపదముల
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రు

లంగనలతోడఁ గనియించిరందు సూత
ములకు నధమాంగనలయందుఁ బుట్టినట్టి
వారలను లోమజాతులు వీరికంటె
వ్యత్యయము ప్రతిలోమమో యనఘులార॥

వ॥ మఱియు నిందనులోములంతరాళికులును బ్రతిలోములు వ్రాత్యులును ననంబడుదురు. సధవయగు బ్రాహ్మణియందు బ్రాహ్మణునకుఁ జౌర్యంబున జనించినవాఁడు కుండుఁడనంబడు, విధవయగు బ్రాహ్మణికి బ్రాహ్మణునివలనం బుట్టిన గోళకుఁడనంబడును. దానియందే చౌర్యంబున జనించిన బ్రాహ్మ్యదాసుండనంబడు, శూద్రునకు రాజాంగనయందుజనించిన వైదేహ పుల్కసనామంబులుగలవాఁడగు, దీనియందె చౌర్యంబున జనించినవాఁడు వేలవ్యాఘ్యుండగు, శూద్రునికి వైశ్యయందు జనించినవాఁడు పత్త్రసశాలిక నామధేయంబుగలవాఁడగు, దీనియందేచౌర్యంబున జనించివాఁడు చక్రియనంబడు, శూద్రియందుశూద్రునకు జౌర్యంబునజన్మించినవాఁడుమాణాలికుండగు, సవర్ణునకంబష్టయందు జనించినవాఁడాగ్నేయవర్తక నామంబులు గలవాఁడగు, కరీణియందు మాహిష్యునికి జనించినవాఁడు తక్షయురథకారుండును, శిల్పియును, వర్ధకియును లోలాకారకుండును, గర్మకారుండు ననంబడు, విప్రాంగనయందుగ్రునకు జన్మించినవాఁడుసముద్రుండగు, బ్రాహ్మణియందు నిషాదునకు జన్మించినవాఁడు నాపితుండగు, నృపాంగనయందు నిషాదువలనజనించినవాఁడు

నాపితుండగు, నృపాంగనయందు నిషాదువలన జనించిన వాఁడు నాపితుండెయగు, విప్రాంగనయందు నాపితువలన జనించినవాఁడు వేణుకుండనంబడు, వేణుకునకు రాజాంగన యందు జనించినవాఁడు కర్మకారకుఁడనంబడు' బ్రాహ్మణి యందు దౌష్యంతునకు జనించినవాఁడు భాగలబ్ధుండనంబడు, వైశ్యయందు నిషాదునకు జనించినవాఁడు సునిషాదుండనం బడు, బ్రాహ్మణియందు వైదేహునకు జనించినవాఁడు రజ కుండగు, బ్రాహ్మణియందుఁ జండాలునకు జనించినవాఁడు శ్వపచుండగు, ఆశ్వపచునివలన విప్రాంగనయందు జనించిన వాఁడు గుహకుండనంబడు, వైశ్యాంగనకు జండాలుని వలన జన్మించినవాఁడు దంతక, వేలక, సంజ్ఞలు గలవాఁడగు వాఁడు గోళకుడదంబడు, బ్రాహ్మణునకు రాజాంగనయందు బుట్టినవాఁడు సవర్ణుండగు, చౌర్యంబునఁ బుట్టినవాఁడు క్షత్ర జీవకుండగు, బ్రాహ్మణునకు వైశ్యయందు జనియించినసం బ ష్ఠుండు, చౌర్యంబున జనియించినఁ గుంభకారుఁడు, వాఁడే నా పితుండనియు ననంబడు; శూద్రియందు విప్రునకు జన్మిం చినఁ బారశవుండగు, చౌర్యంబున నిషాదుండగు, దౌష్యంతికి బ్రాహ్మణుని వలన జనించినవాఁడు నాపితుండగు, ఆయో గవియందు విప్రునకు జనించినవాఁడు పింగళుఁడగు, బ్రాహ్మ ణునికి రాజువలన జనించిన సూఁతుండగు, చౌర్యంబున రథ కారుండగు, (క్షత్రియస్త్రీలయందు) క్షత్రియునకుఁ జౌర్యంబున జనించిన వాఁడు భోజుండగు, క్షత్రియునకు వైశ్యయందు జనించినవాఁడు మాహిష్యాంబష్ఠ సంజ్ఞలు

గలవాఁడగు, దానియందు చౌర్యంబున జనించినచిర సంజ్ఞుండగు. శూద్రియందు క్షత్రియునకు జన్మించినవాఁడు దౌష్యంతుఁ డనంబడు, దానియందే చౌర్యంబున జనించిన వాఁడు శాలీనుం డనంబడు, బ్రాహ్మణియందు వైశ్యునకు జనించినవాఁడు క్షత్తయనంబడు, దానియందే చౌర్యంబున జనించినవాఁడు మ్లేచ్ఛుండగు, రాజాంగన యందు వైశ్యునకు జనించినవాఁడు శాలిక,మాగధ, సంజ్ఞలు గలవాఁడగు, దానియందే చౌర్యంబున జనించినఁ బులిందుం డనంబడు, వైశ్యయందు వైశ్యునకుఁ జౌర్యంబున జనించిన వాఁడుమణికారకుండనంబడు, శూద్రియందు వైశ్యునకు జనించినవాఁడు గుప్తుఁడనంబడు, దానియందేచౌర్యంబున జనించిన నటకారుండగు, శూద్రునకు విప్రాంగనయందు జనించినవాఁడు చండాలుండగు, వీనివలన శూద్రాంగనయందు జనించినవాఁడు శ్వపచుండనంబడు. ప్రతిలోమ నిషాదులకు శూద్రియందు శైరివ్రు లుదయించిరి, మాగధునవలన శూద్రియందు జనించినవాఁడు కుకుందుం డనంబడు, నృపాంగనయందు మాగధుని వలన జనించినవాఁడు ఖనకుండనంబడు, ఆఖనకుని వలన రాజకన్యకయందుద్బంధుఁడుదయించె, ఆయోగవునికి రాజకన్యయందుఁ జర్మకారుండు బుట్టె, విప్రవ్రాత్యునకు విప్రాంగనయందు వందకుండు పుట్టె, క్షత్రవ్రాత్యునకు క్షత్రాంగనయందు మల్లుకుండు పుట్టె, మల్లునివలనఁ బిచ్ఛలుండును వానివలన నటుండును, నుదయించిరి, నటునికిఁ గరణుండును,గరణునివలనఁ గర్మసంజ్ఞుండును, వానివలన నృపాంగనయందు

ద్రమిళుండును, వైశ్యవ్రాత్యునికి వైశ్యయందు సుధన్వుం డును, బుట్టిరి, వానికవార్యుండును, వానికి భారుషుండును, వానికిద్విజన్ముండును వానికిమైత్రుండును, వానికిసాత్వతుండును, వానికి మాతంగుడును. వానివలనసూతుండును, వానివలన దస్యుండును, వానివలన మాలాకారుండును, బ్రతిలోమని షాదునివలన గైవర్తుండును, మాలాకారస్త్రీయందాయోగుని వలన నీలాదివర్ణ విక్రాంతయును, కారాచారు సమాఖ్యయందు నిషాదువలనఁ జన్మజీవియుం జనించిరి. విజ్ఞానసాగరు లారా! సంగ్రహంబుగా మద్గురు శాసనంబున నగస్త్యునివలన వినిన జాతినిర్ణయంబు మీకెఱింగించితి; స్వజాత్యుక్త కర్మంబీశ్వరా ర్పణంబుగా యథాశక్తిం జేసిన పురుషుండు దానివలన ముక్తి గాంచు. ఇదేవేదానుశాసనంబు, సకల జనంబులకు స్వ జాతి ధర్మవిహీనంబుగా గర్మకోటులొనర్చిన నైన ముక్తి లేదు, ఇది వేదార్థ నిశ్చయంబు. పశ్వాదులకుంబోలె భౌతికంబులగు స్థూల శరీరంబులకు జాతిభేదంబు లేదు. ఈ దేహంబే నేనను నహంభావంబున నాత్మకువిప్రాదిజాతిభేదం బులేర్పడియె. స్వస్వజ్ఞానంబు లేమి దేహాభిమానంబు బాయకుండురు. అట్టిజ్ఞానంబు వేదాంత నిశ్చితంబు. అ దియు సద్గురూపదేశంబునఁగలుగు. ఎవ్వాని కపరోక్ష జ్ఞానంబు గల్గు వానికి విధినిషేధంబులు లేవు. ఇది వేదనిశ్చితంబు. వర్ణాశ్రమాచారపరులు, వేదకింకరు లగుదురు. స్త్రీ పురు షులం దెవ్వరికైన బ్రహ్మవిజ్ఞానం బపరోక్షంబుగా గలుగు వారలకు వర్ణాశ్రమాచార ధర్మం బెంత మాత్రంబును

బనీలేదు. గురూక్తంబుగా నెఱుంగకసర్వవర్ణాశ్రమాచార ధర్మంబులు వదలినవారు ఘోరనరకంబులం గూలుదురు. అట్లుగావున సర్వప్రయత్నంబుల సర్వకాలంబును సర్వ వర్ణాశ్రమ మంబులవారు శ్రౌతస్మార్తకర్మంబులు శ్రద్ధాశక్తులై నడుపవలయు. అట్లయినఁ గ్రమంబుగా ముక్తిబడయుదురనిసూతుండూరకుండె.

8. బ్రహ్మవలన బ్రాహ్మణులు గలిగినట్లును, క్షత్రియ వైశ్య శూద్రులు బ్రాహ్మణజాతివలన గుణకర్మనిమిత్తమునఁ గలిగినట్లును శుక్లయజుర్వేదగత బృహదారణ్యోపనిషత్తులోని 1-4-11,12,13,14,15ల లోని వాక్యములలోనున్నది: (అగ్ని దేవత బ్రాహ్మణుఁడనియు, ఇంద్ర, వరుణ, పర్జన్య, మృత్యువులు, క్షత్రియులనియు, వసు, రుద్ర, ఆదిత్యగణములు, విశ్వేదేవులు, మరుత్తులు, వైశ్యులనియు, పూషణ అను దేవత శూద్రుఁడనియు నీశ్రుతి చెప్పుచున్నది.)

9 (బ్రహ్మవా ఇదమగ్రఆసీదేకమేవ తదేకగ్ం సన్నవ్యభవత్ తచ్ఛ్రేయోరూపమత్యసృజత క్షత్రం యాన్యేతాని దేవత్రా క్షత్రాణీంద్రో వరుణస్సోమోరుద్రః పర్జన్యో యమోమృత్యు రీశానితితస్మాత్ క్షత్రాత్పరం నాస్తితస్మాద్బ్రాహ్మణః క్షత్రియమధస్తాదుపాస్తే, రాజసూయే క్షత్రి ఏవతద్యశోదధాతి సైషాక్షత్రియస్య యోనిర్యద్బ్రహ్మ తస్మాద్యద్యపిరాజా పరమతాం గచ్ఛతి బ్రహ్మైవాంతత ఉపనిశ్శ్రయతి స్వాం యోనిం యఉపనగ్ం హినస్తిస్వాగ్

సయోనిమృచ్ఛతి సపాపీయాన్భవతి యథా శ్రేయాగ్ం
సగ్ంహిగ్ంసిత్వా''.11. సనైవవ్యభవత్సవిశమసృజతయా
న్యేతాని దేవజాతాని గణశఆఖ్యాయంతేవసవోరుద్రా
ఆదిత్యావిశ్వేదేవామరుతఇతి.12. సనైవవ్యభవత్సశౌద్రం
వర్ణమసృజత పూషణమియం వైపూషేయగ్ం హీదగ్ం
సర్వంపుష్యతి యదిదంకించ.13. సనైవవ్యభవత్తచ్ఛ్రేయో
రూపమత్యసృజతధర్మం తదేతత్ క్షత్రస్య క్షత్రంయద్ధర్మస్త
స్మాద్ధర్మాత్పరం.14. తదేతద్బ్రహ్మక్షత్రంవిట్ శూద్రస్త
దగ్నినైవదేవేషు బ్రహ్మభవద్బ్రాహ్మణో మనుష్యేషు
క్షత్రియేణ క్షత్రియోవైశ్యేనవైశ్యశూద్రేణశూద్రః.15.

9. అనఁగా సృష్టికాలమున దేవతలలో అగ్నిరూపమెత్తిన బ్రహ్మ మనుష్యులలో బ్రాహ్మణుఁడుగ మారెను. తర్వాత వారి కర్మపరిపాలనముకొఱకు బ్రాహ్మణులవలన క్షత్రియులను, ధాన్యాది సంపాదనముకొఱకు బ్రాహ్మణులవలన వైశ్యులను, బ్రాహ్మణకర్మపోషణముకొఱకు వారివలన శూద్రులను బుట్టించి, వర్ణవిభాగముఁ జేసెను. కాన మొదట నొకటియె వర్ణమనియు, రానురాను బ్రాహ్మణులు విస్తరించిన కొలఁది పరులగు మ్లేచ్ఛాదులు వారి నాక్రమింప వారిశ్రౌతాదికర్మలను జెడకుండ జేయుటకు రాజులును భూమినుండి పంట పండించి దేశీయులకద్దాని వ్యాపింపఁజేసి ధనసమృద్ధి జేయుటకు వైశ్యులను, వారిముగ్గురిని సేవించుకొఱకు శూద్రులను, నాబ్రాహ్మణులలోనివారె వారి **గుణకర్మముల** నాశ్రయించి యుదయించినట్లు శ్రుతి చెప్పుచున్నది.

10. దీనియర్థమునే భగవద్గీత యనువదించుచున్నది. (గీ4అ 13శ్లో), బృహదారణ్యశ్రుతిని భారతాదుల ననుసరించి దేవతలలోఁగూడ బ్రాహ్మణాది వర్ణవిభాగముఁ గలదని రంగ రామానుజులును, శ్రుతప్రకాశాచార్యులును, వ్యాఖ్యఁజేసిరి. జ్యోతిశ్శాస్త్రములవలనఁ గూడ గ్రహములలో వర్ణవిభాగ మున్నట్లు గానుపించును. ద్వైతాద్వైతాచార్యులీ శ్రుతులు దేవతావర్ణవిభాగవిషయమై యర్థవాదములని నుడివి మనుష్యులలోని బ్రాహ్మణాది వర్ణులకు నగ్నియింద్రాది దేవతలధిష్ఠాతలుగాన వారివర్ణములుగూడ నాదేవతలకు నుపచారకములుగ బ్రయోగింపఁబడినవనిరి. శంకరులు గీతాభాష్యములో(గీ4–11)శ్లోకములో మనుష్యలోకములో మాత్రమే వర్ణవిభాగము గలదని వ్రాసిరి. రామానుజులు "మానుషేలోకే" అనువాక్యము స్వర్గమునుఁగూడఁ దెలియ జేయుననిరి. కాన దేవతలలో వర్ణవిభాగమున్నను లేకున్నను, మనుష్యజాతిలో నున్నట్లు స్పష్టము.

11. భాగవత పంచమ స్కంధములో జంబూ ద్వీపము నందువలెఁ దక్కిన 5 ద్వీపములలోఁగూడ చాతుర్వర్ణ్యములు కలవని యున్నది.

1 జంబూ ద్వీపములో :– బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు, శూద్రుఁడు.

2 ప్లక్ష ద్వీపములో :– ( భాగ. 1 స్కం. 20 అ. 5శ్లో. హంసుఁడు, పతంగుఁడు, ఊర్ధ్వాయనుఁడు, సత్యాంగుఁడు.

3 శాల్మలీ ద్వీపములో (భాగ 5 స్కం. 20 అ. 9 శ్లో.)
శ్రుతిధరుఁడు, వీర్యధరుఁడు, వసుంధరుఁడు, ఇషుంధరుఁడు.

4 కుశ ద్వీపములో— (భాగ. 5 స్కం. 20 అ. 15 శ్లో.)
కుశలుఁడు, కోవిదుఁడు, అభియుక్తుఁడు, కులకుఁడు.

5 క్రౌంచ ద్వీపములో—(భాగ. 5 స్కం. 30 అ. 21 శ్లో)
గురువు, ఋషభుఁడు, ద్రవిణుఁడు, సేవకుఁడు.

6 శాక ద్వీపములో— (భాగ. 5 స్కం. 20 అ. 32 శ్లో)
ఋతవ్రతుఁడు, సత్యవ్రతుఁడు, దానవ్రతుఁడు, అనువ్రతుఁడు.

7 పుష్కర ద్వీపములో— (భాగ. 5 స్కం. 30 అ. 32 శ్లో)
ఒకటియే వర్ణముండెది.

కాన బ్రాహ్మణ క్షత్రియ విట్ శూద్రులవలె నితర ద్వీపములలోఁగూడ వర్ణవిభాగముండుట సహజము. అట్లు లేనియెడల సంఘములోని వ్యవహార వ్యవస్థ బాగుగ నుండనేరదు.

12. పైన నుదాహరించిన బృహదారణ్య శ్రుత్యర్థమును మహాభారత పురాణాదులుగూడ ననువదించుచున్నవి.

శ్లో॥ నవిశేషోఽస్తివర్ణానాం । సర్వంబ్రాహ్మ మిదంజగత్।
బ్రాహ్మణా పూర్వసృష్టంహి । కర్మభిర్వర్ణతాంగతం।
కామభోగప్రియూస్తీక్ష్ణాః । క్రోధనాః ప్రియసాహసాః।
త్యక్తస్వధర్మా రక్తాంగా । స్తేద్విజాఃక్షత్రతాంగతాః।
గోభ్యోవృత్తిం సమాస్థాయ । పీతాఃకృష్యుపజీవినః।

స్వధర్మాన్నానుతిష్ఠంతి । తేద్విజావైశ్యతాంగతాః।
హింసానృతప్రియాలుబ్ధా । స్సర్వకర్మోపజీవినః।
కృష్ణాశ్శౌచపరిభ్రష్టాస్తే । ద్విజాశ్శూద్రతాంగతాః।
ఇత్యేతైః కర్మభిర్వ్యస్తా । ద్విజావర్ణాంతరంగతాః।
మ. భార. శాంతి. 188 అ.

శాంతిపర్వములోని 189 అధ్యాయములో బ్రాహ్మణక్షత్రియ శూద్ర మ్లేచ్ఛ పిశాచ రాక్షసాదుల గుణకర్మలను జెప్పి తుదకు

"శూద్రేచైతద్భవేల్లక్ష్యం ద్విజేతచ్చనవిద్యతే,
నవై శూద్రో భవేచ్ఛూద్రో బ్రాహ్మణోనచబ్రాహ్మణః॥"

అని భృగువు భరద్వాజులతోఁ జెప్పెను. ఇచ్చట "శూద్రేచేతి ఏతత్సత్యాది సప్తకం ద్విజేత్రైవర్ణికే ధర్మఏవ వర్ణవిభాగేకారణం, నజాతిరితి", అని నీలకంఠవ్యాఖ్య. కాన జాతి తెలియచప్పుడు సత్యశమాది గుణములవలననే వర్ణము నిర్ణయింపనగు. అట్లే సత్యము పలికినందువలన సత్యకాము జాబాలి బ్రాహ్మణుండని నిర్ణయింపఁబడినట్లు ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది.

13 పూర్వోదాహృత శాంతిపర్వగతాధ్యాయార్థమును వాయు, పాద్మ, గారుడ, వామన, నృసింహాదిపురాణముల ననువదించుటయేగాక యీయర్థమునే శంకరులుసర్వసిద్ధాంత సంగ్రహములో వ్యాసమతముని యీతీరున వివరించిరి:—

శ్లో॥ చతుర్వ్యూహాత్మకో విష్ణుశ్చతుర్ధావాఽకరోజ్జగత్ ।

సారముగను సృజించెను. బ్రాహ్మణుని వర్ణము తెలుపు, క్షత్రియునివర్ణమెఱుపు, వైశ్యునివర్ణము పసుపు, శూద్రుని రంగు నలుపు. వారి వర్ణాశ్రమ ధర్మములు ధర్మ శాస్త్ర మందు వివరింపఁబడినవి. ప్రతివర్ణమువారికి మోక్షమును బొందు నధికారముగలదని చెప్పుటకుఁ బ్రతివర్ణములో గుణ ముల ననుసరించి నాలుగు వర్ణముల స్వభావము గలవా రున్నారని వేదవ్యాసులు సెలవిచ్చిరి. వారి కర్మ పరిపాక క్రమముననుసరించి వేదోక్తకర్మకాండయందుఁ గొందఱకు దేవతా కాండయందుఁ గొందఱకు జ్ఞానకాండయందుఁ గొం దఱకు నభిరుచిఁగలిగించి వ్యాసులు వారిని బ్రవేశపెట్టించెను. బ్రాహ్మణజాతిలోఁ బుట్టినవారిలో న్యాయవర్తనముఁ గల వారు, శుద్ధులగు వర్ణకాంతిఁ గలవారు, ఓర్పు, గలవారు దయాళువులు, స్వధర్మనిరతులు మాత్రమే నిజమైన బ్రా హ్మణులు. తమకిష్టములగు విషయముల ననుభవింప నాసపడువారు, తీక్ష్ణులు, కోపముఁగలవారు, సాహసులు, స్వ ధర్మములను వదలిన వారు, ఎఱుపు రంగు దేహకాంతిఁ గలవారగు బ్రాహ్మణ జాతివారే క్షత్రియులైరి. పసుపు లను బాలించువారు, పచ్చరంగు గలవారు, వ్యవసాయ వృత్తివలన జీవించువారు, (కాని) స్వకర్మమును జేయనివా రగు బ్రాహ్మణ జాతివారే వైశ్యులయిరి. భూతహింసను గావించువారు, అసత్యము నాడువారు, అల్పులు, తమ పొట్టకొఱకేపనినైనను జేయువారు, నల్లనివారు, శౌచము లేనివారు,నగు బ్రాహ్మణజాతి వారె శూద్రులయిరి.

# 4 వర్ణోత్పత్తి కాలము

15. వర్ణోత్పత్తి కాలమును గూర్చి భగవానులగు శ్రీకృష్ణులు ఉద్ధవుని కిట్లు సెలవిచ్చిరి. భాగ. 11 స్కం. 17 అ. 8–14 శ్లో.)

శ్లో॥ 'ధర్మస్యతవ ప్రశ్నో నైశ్శ్రేయసకరో నృణాం
వర్ణాశ్రమాచార వతాంతముద్ధవనిబోధమే
ఆదౌకృతయుగే వర్ణోనృణాం హంస ఇతి స్మృతః
కృతకృత్యాః ప్రజాజాత్యాతస్మాత్కృతయుగంవిదుః
వేదఃప్రణవ ఏవాగ్రేధర్మోహం వృషరూపధృత్
ఉపాసతే తపోనిష్ఠా హంసంమాంముక్తకిల్బిషాః
త్రేతాముఖే మహాభాగప్రాణాన్మే హృదయాత్త్రయీ
విద్యాప్రాదురభూత్తస్యా అహమాసంత్రివృన్మఖః
విప్రక్షత్రియవిట్శూద్రాముఖ బాహూరుపాదజాః
వైరాజాత్పురుషాజ్జాతాయ ఆత్మాచారలక్షణాః
గృహాశ్రమోజఘనతో బ్రహ్మచర్యం హృదోమమ
వక్షస్థలాద్వనేవాసోన్యాసశ్శిరసి సంస్థితః
వర్ణానామాశ్రమాణాంచ జన్మభూమ్యనుసారిణః
ఆసన్ప్రకృతయోనృణాం నీచైనీ చోత్తమోత్తమాః॥'

16. వీని తెలుగర్థమిది:— ఉద్ధవా, నీప్రశ్నంబు ధర్మావిరుద్ధంబు. వర్ణాశ్రమాచారవంతులైన నరులకు

మోక్షదాయకంబు. దానిం జెప్పెద నాకర్ణింపుము. కల్పాది యందలి కృతయుగంబునందు నరుల వర్ణము హంసాఖ్యం బయ్యె. అందు జనులు జన్మమాత్రమునఁ గృతకృత్యులైరి. కావున నయ్యుగంబు కృతంబనం బరఁగె. తొలుతఁ బ్రణవ మొక్కండే వేదంబు. వృషభరూపధరుండైన నేను ధర్మంబు. జనులు తపోనిష్ఠులయి ముక్తకల్మిషులయి హంసరూప ధరుండైన నన్నుపాసింతురు. పిదపఁ ద్రేతాయుగంబున నా హృదయమునుండి త్రయీవిద్య యావిర్భవించుటను హోత్రాధ్వర్యూద్గాతృములఁ ద్రిరూపంబైన యజ్ఞంబునే నైతి. అప్పుడు వైరాజపురుషుని ముఖబాహూరుపాదంబుల నాత్మాచార లక్షణంబులతో బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు జనించిరి. మదీయజఘన హృదయము వక్షస్థల శీర్షములం గ్రమముగ గార్హస్థ్య బ్రహ్మచర్యవనస్థా సన్న్యాసాశ్రమంబులుదయించె. జన్మస్థానములకుఁ దగినట్లు నరులకు వర్ణాశ్రమంబులు, నీచోత్తమ మధ్యమ ప్రకృతులేర్పడెను. కాన వేద యజ్ఞ వర్ణాశ్రమంబులు నీచోత్తమమధ్యమ ప్రకృతులేర్పడియె. కాన వేదయజ్ఞ వర్ణాశ్రమ ధర్మములు త్రేతాయుగమునుండి మన దేశములోఁ బ్రచారము గలిగినట్లు దీనివలనఁ దేలును. భూతభవిష్యద్వేదులును యోగసిద్ధులగు అనిబిసెంటమ్మ లెడ్బీటరుగార్లు ( Man Etc. ) మానవోత్పత్తి వృద్ధియను నింగ్లీషుగ్రంథములో (334—335 పుట) జగత్సృష్టి పిదపఁ జాలకాలము క్రిందట నీదేశములో నార్యుల వ్యాప్తిగలిగినట్లు వ్రాసిరి. ఇప్పటికి షుమారు

11500 సంవత్సరములక్రింద నార్యులు వారిజన్మభూమినుండి ఆఫ్ఘనిస్థానము బెలూచిస్థానమును బ్రవేశించి అక్కడ 2000 సంవత్సరముండి పిదప భరతఖండమునకు రాసాగిరి. అక్కడచాల మంది అట్లాంటియను, అట్లాంటిక్ లెమోరియన్ జాతులుండుటచే వారితో, నార్యులు సంబంధముచేయు భీతి యీవహించి వివాహము చేయకూడదని వైవసత్వమను వాజ్ఞచే నిప్పటికి సుమారు 8000 సంవత్సరముల క్రిందట వర్ణవ్యవస్థ నేర్పాటుచేయంబడినది. మొదట బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనుమూడు వర్ణములనే మనువేర్పర్చిరి. బ్రాహ్మణులు శుద్ధార్యులు, క్షత్రియులు ఆర్యులును(Aryans) టోల్టెక్కులు (Tallecs)ను, గలిసినసంతతివారు. వైశ్యులార్యులతో గలసినమంగోలియనుల సంతతివారు. అక్కడనుండి యీజాతులకు వర్ణములనురంగు లేర్పడినవి. స్వచ్ఛులగు నార్యులు (బ్రాహ్మణులు, తెల్లవారు. ఆర్యులు, టోల్టెక్కులు కలిసిన మీద పుట్టినక్షత్రియులరంగు ఎఱుపు. ఆర్యమంగోలియనుల మిశ్రమువలనం గలిగిన వైశ్యులరంగు పసుపు. మొదట నీమూడు వర్ణములవారు పరస్పరము పెండ్లియొనర్చ నంగీకరించిరి. తరువాత నేవర్ణమువారావర్ణమువారితో మాత్రమే పెండ్లి చేసికొను నియమము నంగీకరించిరి. పిదప నార్యులు కాని వారికందఱకు శూద్రులని పేరుగలిగెను. ఈశూద్ర దేహములలోం గూడం గొంతవఱకు నార్యరక్తము వ్యాపించినది. కొండవారిలో చాల మందిలో నార్యరక్తము కొంత ప్రసరించినది. కొండఋష్యాద్రిగ నార్యులే,

# 5· వర్ణవిభాగము గుణకర్మానుసరణము

17 ఈవర్ణధర్మములకు గారణములు వానిని జేయు వారి పూర్వగుణకర్మములని భగవంతు లర్జునునకు ‚‚చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః"(గీ 4- 10 శ్లో) అని సెలవిచ్చిరి. దానికిఁ బ్రమాణముగా ‚‚బ్రాహ్మణోస్య ముఖమాసీత్ ''లోనుగాగల శ్రుతులను శంకరాచార్యులుదాహరించిరి. ఆనందగిరులు వర్ణాశ్రమ ధర్మోత్పత్తియు దాని హేతువులు నీశ్లోకములోఁ జెప్పఁ బడినవనిరి. దీనిలోని గుణశబ్దమునకు సత్వరజస్తమములని శంకరభాష్యము.

బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాంచపరంతప|
కర్మాణి ప్రవిభక్తా నిస్వభావప్రభవై ర్గుణైః||

గీ, అ, 18 శ్లో 41.

ఇక్కడ స్వభావ శబ్దమునకు మూఁడర్థములను శంకరులు స్వీకరించిరి. 1 స్వభావమన:—ఈశ్వరప్రకృతియు, త్రిగుణాత్మకమును, నగుమాయ. 2 బ్రాహ్మణాదిస్వభావము నగు సత్త్వాదిగుణ వికారము కారణము (3) పూర్వజన్మ మందుఁ జేసిన కర్మముయొక్క వాసనారూపమగు సంస్కారము. ఆసంస్కారము ప్రాణులిప్పటి జన్మమునఁజేయ బోవు కార్యములను బ్రకటించును. కాన దానిని స్వభావ మందురు. ఆస్వభావము గుణములకు హేతువు. దీనికి ఆనందగిరి యిట్లు టీకనువ్రాసెను. ప్రాణులపూర్వజన్మవాసన

యీప్రకృతి జన్మలో నభివ్యక్తములగు ప్రాణుల సత్త్వాది గుణములకు నిమిత్త కారణము. ఆగుణములకు నుపాదాన కారణము ప్రకృతి. "ప్రకృతిజైర్గుణైః" గుణములు కార ణములేనిది పుట్టవుకనుక వాని యుభయకారణములను ఆ నందగిరులు తేటపఱచిరి. సాంఖ్యులు గూడ నాత్మలు గుణ కర్మవశముచే బ్రహ్మమొదలు స్థావరమువఱకు సృష్టిలో నుండు రూపములను ధరించు చున్నారనిరి. సర్వసిద్ధాంత సంగ్రహములోని 30వ శ్లోకమును జూడుడు:-

"ఆత్మానః ప్రళయేలీనాః ప్రకృతౌ సూక్ష్మదేహినః।
గుణకర్మవశాద్బ్రహ్మస్థావరాంతస్వరూపిణః॥

ప్రళయములో జీవులు తమ సూక్ష్మదేహములతోఁ బ్రకృతిని లీనమై వాని గుణకర్మముల ననుసరించి సృష్టి లో బ్రహ్మమొదలు స్థావరమువఱకు నుండు దేహములను బొందుచున్నవి.

— o —

# 6 వర్ణపరిణామము - తత్కారణము

18 సాధారణముగా నొక వర్ణమువారు మఱియొక వర్ణముగా మారుటలేదు. ఈనియమమునకు హేతువు వారి సూక్ష్మశరీరములలోని భూత సూక్ష్మముల భేదములని అనిబెసెంటమ్మగారు The Peigree of man అను గ్రంథ ములో వ్రాసిరి. వర్ణాశ్రమ ధర్మానుష్ఠానము బాగుగా

నున్నప్పుడే యీ నియమమున కపవాద మరుదుగా గలిగినట్లు విశ్వామిత్ర ఋష్యశృంగులే దృష్టాంతములు. కాన నొక జన్మమందే వర్ణముమారుట ఉత్కట పుణ్యపాప కర్మల వలనఁ గలుగునని మనువుకూడ తన స్మృతిలో నిట్లు సెలవిచ్చెను.

"తపోబీజప్రభావైస్తు తే గచ్ఛంతి యుగే యుగే
ఉత్కర్షం చాఽపకర్షం చ మనుష్యేష్విహ జన్మతః|"
శనకైస్తు క్రియాలోపాదిమాః క్షత్రియజాతయః|
వృషలత్వం గతా లోకే బ్రాహ్మణాదర్శనేన చ||
పౌండ్రకాశ్చౌఢ్రద్రవిడాః కాంభోజా యవనాశ్శకాః||
పారదాపహ్లవాశ్చీనాః కిరాతాదరదాశ్శకాః|| (10-42-44)

నాలుగుజాతులలోఁ బుట్టినవారును, ప్రతిలోమాను లోమజాతులందుదయించిన వారును, (విశ్వామిత్రుని వలె) దపఃప్రభావముచేతను, (ఋష్యశృంగునివలె) బీజప్రభావము చేతను నన్నియుగములందు నుత్కృష్టతను బొందుచున్నారు. అట్టి ప్రభావములేనందున నీజన్మమందే తక్కువ వర్ణమును బొందుచున్నారు. బ్రాహ్మణుని సేవింపకపోవుట చేతను, ఉపనయనము మొదలగు కర్మల లోపముచేతను మీఁదఁజెప్పఁబడిన క్షత్రియ జాతులు నానాట శూద్రత్వమును బొందిరి. పౌండ్రకము, ఓఢ్రము, ద్రవిడము, కాంభోజము, యవనము, పారదము, శకము, అను దేశముల నేలిన వారందఱు మీఁదఁ జెప్పినట్లు శూద్రులయినారు. విశ్వామిత్రుని తల్లి పొరబాటున బ్రాహ్మణచరువునుదిని గర్భము ధరించి యం

దతండు పుట్టుటచే నా జన్మమునందే విప్రత్వము వచ్చినది. కాని యతని తపఃప్రభావముచే రాలేదని కొందఱు పెద్దలు సెల విచ్చిరి. చరుగాథలు భారతానుశాసన భాగవత నవమ స్కంధ పంచదశాధ్యాయనులలోను గలవు. విప్రబీజమే విశ్వామిత్రుని బ్రాహ్మణ్యమునకు హేతువైనచో నీతండు పుట్టినప్పటి నుండి క్షత్రియుండేలయయ్యె? తరువాతఁ దనతప స్సుచే బ్రాహ్మణ్యము వచ్చినట్లు చెప్పు శ్రుతిస్మృత్యాదు లకు గతియేమి? 'విశ్వామిత్ర తపస్తేపేనోన్నపే పుత్రస్యా మిత్రే' అను శ్రుతి, వక్ష్యమాణమనుస్మృతిలోని (7-42) శ్లోకమునకు బలముగా వ్యాఖ్యాత లుదాహరించిరి. 'పృథుస్తు వినయాదాద్రిజ్యం ప్రాప్తవాన్ మనురేవచ। కుబేరశ్చధ నైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవగాధిజః॥' శ్రుతిస్మృతి విధ్యు క్తాచరణముచేతను, తన్నిషిద్ధమును సేవింపక పోవుటచేతను, గలిగిన తపస్సును వినయముచే క్షత్రియజన్మమునందే గాధి పుత్రుఁడగు విశ్వామిత్రునకు, బ్రాహ్మణ్యము సిద్ధించెనని టీకాకారులు వ్రాసిరి. భారత శల్యపర్వములోని బలరామ తీర్థయాత్రా వర్ణనములో సింధుద్వీపుఁడు, దేవాపి, విశ్వా మిత్రుఁడు, క్షత్రియవర్ణములోఁ బుట్టినను తపోతిశయము చేతను, పృథూక తీర్థస్నాన మహిమచేతను, బ్రాహ్మణ్యముఁ బడసిరని యున్నది. వన పర్వములోని ధర్మరాజ తీర్థయా త్రా వర్ణనములో లోమశర్షిబ్రహ్మతీర్థ విశ్వామిత్రాది తీర్థస్నాన తపోమహిమలచే బ్రాహ్మణత్వ మబ్బెనని చెప్పె. మఱియు, విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యమిట్లు కలిగె

నని శ్రీవాల్మీకి తమ రామాయణ బాలకాండములోని 65 సర్గ
లోనిట్లు వర్ణించిరి;—

శ్లో॥ తతస్సుర గణాస్సర్వే। పితామహపురోగమాః॥ 18
విశ్వామిత్రం మహాత్మానం। మధురం వాక్యమబ్రువన్।
బ్రహ్మర్షేస్వాగతంతేస్తు। తపసాస్మ సుతోషితాః॥ 19
బ్రాహ్మణ్యంతపసోగ్రేణ। ప్రాప్తవానసికౌశిక। 20
బ్రహ్మపుత్రోగ్రమామేవం। వదతుదేవతాః।

* * * * *

యద్యయం పరమఃకామః। కృతోయాంతు సురర్షభాః॥ 24
తతఃప్రసాదితో దేవై। ర్వసిష్ఠో జపతాంవరః।
సఖ్యంచకార బ్రహ్మర్షి। రేవమస్త్విచ మబ్రవీత్॥ 25
బ్రహ్మర్షి స్త్వంనసందేహః। స్సర్వం సంపత్స్యతేతవ।
ఇత్యుక్త్వా దేవతాశ్చాపి। సర్వాజగ్ముర్యథాగతం॥ 26
విశ్వామిత్రోపిధర్మాత్మా। లబ్ధ్వా బ్రాహ్మణ్య ముత్తమం।
పూజయామాసబ్రహ్మర్షిం। వసిష్ఠంజ పతాంవరం॥ 27
కృతకామో మహీంసర్వాం। చచార తపసిస్థితః।
ఏవంత్వనేన బ్రాహ్మణ్యం। ప్రాప్తంరామమహాత్మనా॥ 28

—;వీనికి దెలుఁగు తాత్పర్యమేమన;—

బ్రహ్మ మొదలగు దేవతలంఱును మహాత్ముఁడగువిశ్వా
మిత్రుని గడకువచ్చి మధురముగాఁ,బ్రహ్మర్షీ నీకుస్వాగతము,
నీ తపమునకు మేమెంతయుసంతోషించితిమి. ఈయుగ్ర
తపము వలన నీకు బ్రాహ్మణ్యమును గలిగినది. నేమును
దేవతలును నీకు దీర్ఘాయుష్యమును గూడ నొసంగెదము,

నీకుసుఖంబగు, నీవుమేలొందెదుగాత, నెమ్మదిని బొమ్మ
అనిరి. పితామహుండును దక్క దేవతలందఱును జెప్పిన
మాటవిని విశ్వామిత్రుండమితముదమునొంది యందఱికిని బ్రణా
మంబాచరించి, బ్రాహ్మణ్యమునాకు గలిగెనేని, దీర్ఘాయు
వును నాకు దొరకొనెనేని, ఓం కారమును, వషట్కారమును
వేదములును దామైవచ్చినన్ను వరించుగాక', నేను వానిని
ఒకరికిఁ జెప్పుటకుఁగాని, యొకరిని యజింపఁ జేయునప్పుడువిని
యోగించుటకుఁగాని, యర్హుఁడను గావలయు; మఱొక్కటి
వినుఁడు. వసిష్ఠుఁడు సూర్యవంశ్యుల కనాది పురోహితుఁడై
యుండుటంబట్టి క్షత్రియులకు వలయు నాథర్వణ వేదముల
నెల్ల చక్కఁగా నెఱింగినవాఁడు; మఱియు బ్రాహ్మణులకు
వలయు వేదములందును దేరుడగమైనవాఁడు; బ్రహ్మకు
మానసపుత్రుండు. ఇట్టి మహిమగల యావసిష్ఠుండు నన్ను
బ్రహ్మర్షియనవలయు. నాకు ముఖ్యమగు కోర్కెయిదియే,
దీనినొడఁగూర్చితిరేని యిప్పుడు మీరు నాయెడఁ గృతకృత్యు
లైపోవచ్చును. మఱొక విధమున మీరు చరితార్థులు
గారు సుండీ' యనియె. అంత బ్రహ్మర్షియగు వసిష్ఠుని
దేవతలు ప్రార్థింప నమ్మునియుఁ బ్రసన్నుఁడై విశ్వామిత్రు
నితోఁ జెలిమిగావించి దేవతలు చెప్పి నట్లేయతఁడు కూడ
బ్రహ్మర్షియగుననియె. దేవతలును విశ్వామిత్రునిజూచి "నీవు
బ్రహ్మర్షివగుటకు సందేహమేమియులేదు. ఒక్క బ్రహ్మ
ర్షిత్వమేకాదు, దానివలన యాజనాధ్యాపనాదులగు
నన్నియధికారములు నీకుఁ గలుగు'నని చెప్పి తమ వచ్చిన

దారింబోయిరి. విశ్వామిత్రుఁడట్లుత్తమమగు బ్రాహ్మణత్వమునొంది యన్నిధర్మము లెఱింగినవాఁడుగాన బ్రహ్మర్షియగు వసిష్ఠుని బూజించి కృతార్థుఁడై తపము సలుపుచుఁ బుడమియంతయుఁదిరిగె, రామా! ఈమహాత్ముఁడీచందమున బ్రాహ్మణత్వముఁబడసె." దీనిననుసరించియే శ్రీ మురారిభట్టులు అనర్ఘరాఘవ నాటకములోని 1 అంకములోని 22 శ్లోకములో విశ్వామిత్రుల నిట్లు వర్ణించినట్లగపడును:— 'యః క్షత్రదేహం పరితక్ష్యటంకైః, తపోమయైః బ్రాహ్మణముచ్చకార | పరోరజోభిః స్వకస్త్రైరగాధః సగాధిపుత్రోపిగృహానుపైతి॥' వ్యాసఋష్యశృంగాదులకు విప్రాదివర్ణములు బీజప్రభావముచేఁ గలిగెనని మనుస్మృతిలో నిటులున్నది. 'విశిష్టం కుత్రచిద్బీజం' (9—34), ''యస్మాద్బీజప్రభావేణ తిర్యగ్జాఋషయోఽభవన్, పూజితాశ్చ ప్రశస్తాశ్చ తస్మాద్బీజం ప్రశస్యతే'' (10—72). గొప్ప వర్ణమును బడయుటకు తపోబీజము లెట్లుహేతువులో అట్లేనీచవర్ణమును బొందుటకు వినయాభావ సూచకములగు మాన, మద, క్రోధ, లోభ, హర్ష, దంభాదులు హేతువులని స్పష్టముగ మనువే సెలవిచ్చెను.

'వేనోవినష్టోఽవినయాన్నహుషశ్చైవ పార్థివః।
సుదాః పైజవనశ్చైవ సుముఖోనిమిరేవచ॥ (7—41)

మఱియు భర్తల గుణమహిమచేఁబవిత్రలగు భార్యలు గూడ నుత్కృష్టగుణములు గలవారగుదురని(9—22,23,24) మనువు సెలవిచ్చిరి.

(యాదృగ్గుణేన భర్త్రా స్త్రీసంయుజ్యేత యథావిధి
తాదృగ్గుణాసా భవతి, సముద్రేణైవ నిమ్నగా ॥
అక్షమాలావసిష్ఠేన సంయుక్తాధమయోనిజా।
శారంగీమందపాలేనజగామాభ్యర్హణీయతాం ॥
ఏతాశ్చాన్యాశ్చలోకే స్మిన్నపకృష్ట ప్రసూతయః॥
ఉత్కర్షయోషితః ప్రాప్తాః స్వైః స్వైర్భర్తృగుణైః శుభైః॥

(వసిష్ఠశ్చాండాలీముపయేమే' అను శ్రుతి యిందులకుఁ బ్రమాణము. చండాలస్త్రీయగు- అక్షమాలయే అరుంధతీదేవి. ఆమెచేసిన భర్తృశుశ్రూషా మహిమవలనను, భర్తయగు వసిష్ఠమహర్షి తపఃప్రభావలనను, నామెకట్టి యతిశయము వాటిల్లెను. పెండ్లిలో వధూవరులకు నిప్పటికి నామె నాకాశమునఁ జూపుచుండుట మనకు విదితమేగదా ! అట్లే శార్జపక్షిపిల్లయగు చటికను, మందపాలర్షి పెండ్లియాడుటచే నామెకుఁగూడఁ బ్రశస్త్యమబ్బెనని భారతాదిపర్వములోని 229 అధ్యాయములో నున్నది. ఇట్లే యితరస్త్రీలు నికృష్టవర్ణములయందుదయించినను వారి భర్తల గుణాతిశయముచే వారుత్కర్షనుబొందిరని మనువభిప్రాయపడిరి. పృషధ్రుండను క్షత్రియుండు గురుశాపముచే శూద్రత్వము నాజన్మమునందే పొందెనని భాగవతములో (9 స్కం 2 అ 8 శ్లో) నున్నది. క్షత్రియుఁడగు గర్గునకుశిని, అతనికి గార్గ్యుఁడుఁబుట్టినందున నావంశము బ్రహ్మవంశమయ్యెను. మహావీరునకు త్రతయ్యారుణి,కవి,పుష్కరారుణియు, నను ముగ్గురు కొడుకులు పుట్టి బ్రాహ్మణులైరి. అజమీఢుని ప్రియ

మేధాదులగు కొడుకులు బ్రాహ్మణులైరి. (9 స్కం 21అ. 19,20 శ్లో). ఇట్టిదృష్టాంతములితరస్కంధములలోఁగూడ గలవు. పతంజలితమయోగసూత్రము (2 అ 12 సూ) - ,,క్లేశమూలః కర్మాశయోదృష్టాదృష్ట జన్మవేదనీయః"-లో పుణ్యాపాప మిశ్రకర్మములకు మూలకారణమైనవి దుఃఖరూపములైన క్లేశములు, ఇట్టి వాసనారూపములైన కర్మములు ఈజన్మమందును జన్మాంతరమందును అనుభవింపఁదగిన విగానున్నవి, అని సెలవిచ్చిరి. దీనిపై వ్యాసటీకాసంగ్రహామేమనః-దుఃఖము హేతువుగాగల క్లేశములకుఁ గారణమైయుండు పుణ్యపాపమిశ్రకర్మముల సంస్కారమును, వాని యొక్క ఫలమును,నీజన్మమందును జన్మాంతరమందును అనుభవింపఁదగినవిగా నున్నవి. వాసనారూపములైన యీపుణ్యపాపమిశ్రకర్మముల ప్రాబల్య దౌర్బల్యానుగుణముగా పూర్వజన్మమందలివానినిఁ గూడ నీజన్మమందే యనుభవింపవలసినదిగా, నందికేశ్వరుఁడు బాల్యమందతి త్వరలో పుణ్యఫలము నొసంగు పశుపతినర్చించిన కర్మముచే నాజన్మమునందే దేవత్వమును,సంపూర్ణాయువును,దివ్యభోగములను, బొందెను. 2 విశ్వామిత్రుఁడు పుణ్యోత్కర్షచే క్షత్రియ జాతిని విడిచి బ్రాహ్మణుండాయెను. 3 నహుషుఁడత్యంత పాతకములొనర్చినందున నాజన్మమందే సర్పజన్మమును బొందెను. 4 ఊర్వశి కుమారవనమునందు లతారూపము నొందెను. 5 సౌభరికర్మ వైచిత్ర్యంబున నాజన్మమందే యనేక శరీరములనుబొందెను.

విశ్వామిత్ర జాతశత్రు మరుదేవాపులు క్షత్రియులై యుదయించి తుదకు బ్రహ్మర్షులయినట్లు భారత శల్యపర్వాదులలో నున్నది. క్షత్రియుండగు వీతహవ్యుండు భృగ్వనుగ్రహముచే వారి యాశ్రమములో బ్రాహ్మణుండాయెను.

'వర్ణోత్కర్షమవాప్నోతి నరః పుణ్యేనకర్మణా' అని శాంతి పర్వము (291 - అ- 5 శ్లో) వర్ణారోహణమును వక్కాణించుచున్నది.

శ్లో॥ జ్ఞానవిజ్ఞాన సంపన్న స్సంస్కృతో వేదపారగః
విప్రోభవతి ధర్మాత్మా క్షత్రియ స్స్వేనకర్మణా।
ఏతైః కర్మఫలైర్దేవి న్యూనజాతికులోద్భవః
శూద్రోప్యాగమ సంపన్నో ద్విజో భవతిసంస్కృతః
బ్రాహ్మణోవాప్య సద్వృత్తస్సర్వసంకర భోజనః
బ్రాహ్మణ్యంతు సముత్సృజ్య శూద్రోభవతి తాదృశః।
కర్మభిః శుచిభిర్దేవి శుద్ధాత్మావిజితేంద్రియః।
శూద్రోపిద్విజవత్సేవ్య ఇతి బ్రహ్మానుశాసనం।
స్వభావంకర్మచశుభం యత్ర శూద్రేపితిష్ఠతి।
విశిష్టస్సద్విజాతేర్వై విజ్ఞేయయితి మేమతిః॥

భారతము అను 143 అ శ్లో 44-40 శ్లో.

ఈశ్లోకములలో శివుండు పార్వతికి వర్ణారోహణావరోహణములు వృత్తము వలనం గలుగునని చెప్పి యిట్లు నిగమించెను:—

"నయోనిర్నాఽపి సంస్కారోనశ్రుతం నచసంతతిః
కారణానిద్విజత్వస్యవృత్తమేవతుకారణమ్॥ 50 శ్లో.

జన్మముగాని సంస్కారముగాని విద్యగాని వంశము గాని ద్విజత్వమునకు హేతువుకాదు. వృత్తమొకటియే దానికిఁ గారణము. ధర్మరాజు గూడనిట్లే నహుషునకును యక్షునకును వనమందు నుత్తరమిచ్చెనని భారతవనపర్వమందున్నది.

సత్యము, దానము, క్షమ, శీలము, అహింస, తపస్సు, దయ, యెవనియందున్నవో యతఁడే బ్రాహ్మణుఁడనియు లేనివాఁడు శూద్రుండనియు నిర్ణయింపవలయును గాని జాతిచేతనే వర్ణనిశ్చయముఁ జేయఁదగదు. కాన వృత్తమే బ్రాహ్మణాది నిర్ణయమునకు హేతువనుటకు స్మృతిభారతాదికములు ప్రమాణములు.

—o—

## 7 గుణకర్మజాతుల బలాబలములు

కాని "తపస్సు, శాస్త్రపాండిత్యము, జాతి". అని బ్రాహ్మణవర్ణమునకు మూఁడుహేతువులు కాన తపస్సు, శాస్త్రపాండిత్యము, లేనిచో "బ్రాహ్మణుఁడు జాతిచే మాత్రమగు" నని భగవంతులగు పతంజలి వ్యాకరణమహాభాష్యములో నిట్లుసెలవిచ్చిరి.

"తపశ్శ్రుతంచజాతి (యోని) శ్చేత్యేతద్బ్రాహ్మణకారకం॥"
'తపశ్శ్రుతాభ్యాంయోహీనోజాతి బ్రాహ్మణఏవసః॥'

ఈశ్లోకము భ్రాంతానుశాసనములో నున్నది. ఇట్లే వ్యాసులు పరాశరులు సెలవిచ్చిరి. "బ్రహ్మబీజ సముత్పన్నో మంత్రసంస్కార వర్జితః, జాతిమాత్రోపజీవీచ సభవేన్బ్రామధారకః॥" ప-స్మృతి అ8-6 శ్లో. మాధవీయవ్యాఖ్య. ఇట్లు విష్ణుభాగవత(7 స్కం 11 అధ్యాయాంతమందు)నారదులు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మముల నుపదేశించి యిట్లు నిగమించిరి. "యస్యయల్లక్షణం ప్రోక్తం పుంసోవర్ణాభిసూచకం। యదన్యత్రాపి దృశ్యేత తత్తేనైవవినిర్దిశేత్॥" (భా7-11-34)అనఁగాఏవర్ణంబునకేలక్షణంబు సెప్పఁబడియె నయ్యది యితరులలోఁ గన్పట్టునేని దాన నతని తద్వర్ణయోగ్యునిగా నిర్దేశింపఁదగు. దానికి శ్రీధరాచార్యులిట్లు టీక వ్రాసిరి. "శమాదిభిరేవ బ్రాహ్మణాది వ్యవహారోముఖ్యః నజాతిమాత్రాదిత్యాహ.'- యస్యేతి- యదితి- అన్యత్ర వర్ణాంతరేపి దృశ్యేత తత్తద్వర్ణాంతరంతేనైవ లక్షణనిమిత్తేనైవ వర్ణేన వినిర్దిశేత్ నజాతి నిమిత్తేనేత్యర్థః' అనఁగా ముఖ్యముగా గుణకర్మములచేత నేవర్ణవ్యవస్థను జేయవలయునుగాని జాతిమాత్రముచేతఁ జేయఁదగదు అని శ్రీధరాచార్యులా శ్లోకమున కర్థమును వ్రాసిరి. అట్లే శంకరాచార్యాదులు, అపశూద్రాధికరణ భాష్యరత్న ప్రభలలో విదుర ధర్మవ్యాధులు సంకరజాతులైనను సిద్ధులుగాన వారికి వర్ణాశ్రమధర్మనియమములు వర్తింపవని నిర్ణయించిరి. మహారాష్ట్రోత్తర హిందూస్థానములలోనున్న బ్రాహ్మణేతరులగు భక్తులును దక్షిణదేశమున నుండిన శైవవైష్ణవాదులగు

నికృష్టజాతి భ్రష్టులును, అతివర్ణులనియు, అత్యాశ్రము లనియు, నిర్ణయింపనగు. 'అత్యుత్కటైరిహ పాపైస్సుపుణ్య పాపైస్త్రిభిర్వత్సరైః ప్రారబ్ధం కర్మవిచ్ఛిద్యతే ! తత్త్వత్సలం బుధాః॥' అత్యుత్కట పుణ్యపాపములొక జన్మములోనే గొనసాగించినచోఁ బ్రారబ్ధ కర్మఫలమునుగూడ నవి యుత్కట్టి మహాపుణ్యపాపముల ఫలమాజన్మములోనే యనుభవమునకు వచ్చునని పరాశరులు తమ యుపపురాణములో సెలవిచ్చి నట్లు మాధవాచార్యులు పరాశర స్మృతివ్యాఖ్యలో వ్రాసిరి. స్కాందపురాణమం దీశ్వరనామముచే వ్యాఘ్రము గణేశత్వ ము నొందినట్లును, మహాభారతములో నహుషునకింద్రత్వము సర్పత్వము నొకజన్మములోనే కలిగినటులు చెప్పఁబడియున్నది. ఇత్యాది ప్రమాణ దృష్టాంతములన్నిటివలనను బ్రాహ్మ ణాదివర్ణములకు జాతికంటె ముఖ్యకారణములు గుణకర్మము లనియు, నత్యంత పుణ్యపాప సమాచరణముచే నీచోచ్చ వర్ణముల కొకజన్మమందే యారోహావరోహణములు విశ్వా మిత్ర నాభాగ నహుషాదులవలె నగుననియుఁ దేలును.

# 8 వర్ణాశ్రమ ధర్మములు

20 వర్ణాశ్రమధర్మములు రెండుతెఱంగులు:—సాధా రణములు, అసాధారణములు, అని మన్వాదిస్మృతి పురాణేతి హాసములలో వానివివరము లున్నవి. ధర్మార్థకామము లగు మూఁడు పురుషార్థములను మాత్రముద్దేశించి చేయఁ

బడినచో లౌకికాలౌకిక కర్మములు ప్రవృత్తిరూపములగు, కాని అహంకార మమకారములు లేకయు నాకర్మములఫలమును గోరకయు నాఫలము భగవదర్పణ పురస్సరముగాగాని లోకసంగ్రహార్థముగాని శ్రద్ధాభక్తులతోఁ జేసినచో నాకర్మములే సత్వశుద్ధిని గలుగజేసి తద్వారా మోక్షోపకారకములగుననియు, శాస్త్రకారుల దృఢాశయము. దీనినే పలుమారు బహుప్రకారముల భగవంతుఁడు, ఉద్ధవార్జునకుచేల నారదాదులకును నొక్కి యుపదేశించుటచే దీనిని హరిమతమనెదరు. మనముచేయు పనికి కర్మమనిపేరు శ్రుతి స్మృత్యాదులలో నేవర్ణము వారేయాశ్రమ లోనేయే కర్మములను జేయఁగుననియు, సర్వవర్ణములవారే కర్మమును జేయవగుననియు, నిర్ణయింపఁబడినదానికి ధర్మమనిపేరు. కాన జగత్తులోని ప్రజలనుకలిపి రక్షించును గాన ధర్మమని పేరు గలిగినట్లు మహాభారతములోఁ గలదు. 'ధారణాద్ధర్మమిత్యాహుర్ధర్మో ధారయతిప్రజాః (భా. కర్ణ ప. 69అ 57శ్లో.) కాని కర్మధర్మశబ్దములు శాస్త్రములందు పర్యాయపదములుగ వాడఁబడుచున్నవి. స్వాభిప్రాయకృతమగు కర్మము మాత్రము కేవల క్రీడాకర్మముగాని ధర్మమనిపించుకొనదనియు, స్మృతిజ్ఞానముచేఁ జేయు కర్మమే యనంతఫలకారియనియు, కూడ వృద్ధులీతీరున సెలవిచ్చిరి. 'స్వాభిప్రాయకృతం కర్మక్రీడాకర్మైవ కేవలం స్మృతిజ్ఞానాదానుష్ఠానమనంత ఫలదంవిదుః' కార్యాకార్యములందు శాస్త్రమునరసి ధర్మమాచరింపవలయుననిగూడ భగవద్గీతాదిప్రమాణములు చెప్పుచున్నవి.

మఱియు, తైత్తిరీయ శిక్షావల్ల్యంతమందును భ॥గీ॥అ3శ్లో20 లోను శ్రేష్ఠులయాచరణమే లోకమునకుఁ బ్రమాణమని కూడఁ జెప్పఁబడినది.

## 9 నరసాధారణధర్మములు.

21 నరమాత్రులందఱు హిందువులవలె వర్ణాశ్రమ ధర్మములున్నను, బౌద్ధాదులవలె లేకున్నను, నాచరింపఁదగిన ధర్మములను సాధారణ ధర్మము లనియెదరు. సత్యము (యథార్థభాషణముగాని సమదర్శనముగాని), దయ (పరుల దుఃఖములను పోఁగొట్టవలెననెడి కోరిక), తపము (కాయాది శోషణము), శౌచము (స్నానాదికములచేఁ గల్గు దేహాది శుద్ధి,) తితిక్ష (శీతోష్ణాది సహనము,) మనస్సంయమమను శమము, యుక్తాయుక్త వివేకము, బాహ్యేంద్రియ జయమను దమము, అహింస (అన్నివిధముల నితరులకుఁ బీడఁ జేయ కుండుట), బ్రహ్మచర్యము (పరస్త్రీవర్జనము, నిషిద్ధదేశ కాలములయందు స్వస్త్రీవర్జనముమ), దానము, స్వాధ్యాయము (యథోచిత విద్యామంత్ర జపాదికము), ఆర్జవము (మనస్సునఁ గౌటిల్యము లేకుండుట,) సంతోషము (తన కర్మము వలన లభించినదానితోఁదృప్తినొందుట), సర్వులను సమముగాఁ జూచు మహాత్ముల సేవ, ప్రవృత్తి రూపములగు నన్ని కర్మములను మెల్లఁగా వదలుట, నరుఁడు సేయుకొన్ని ర్యముల వలనఁ బ్రయోజనము పుట్టకుండుట అరయుట, నము (వృథాప్రలాపము లేకుండుట), దేహాది వ్యతిరిక్తుఁ

డాత్ముఁడనియనుసంధించుట, అతిథిభృత్యాది భూతములకుఁ దగినట్లన్న వస్త్రములిచ్చుట, పశ్వాది భూతములయెడ, విశేషించి మనుష్యులయెడ, నాత్మత్వ దేవత్వబుద్ధి, మహాత్ముల యొక్కయు రక్షించువారియొక్కయు, గుణకర్మములనువినుటయుఁ గీర్తించుటయు,హరిస్వరూపగుణ విభూతులను స్మరించుటయుఁ బూజించుటయు, వారికిన మస్కరించుటయు, దాసునివలె భగవంతునియందు సకలకర్మ సమర్పణమను దాస్యము, హరియందు విశ్వాసాధిక్యమగు సఖ్యంబును, తన్ను దనవారిని హరి సబంధులని భావించి, హరికి వారి నర్పించుటయు, తను నాత్మ సమర్పణమును హరిభక్తి ప్రకారంబులు తొమ్మిదియుం గూడనుప్పది లక్షణంబులఁ దనరు సర్వాత్మతోషణంబైన యుత్తమధర్మంబు సర్వవర్ణ సాధారణంబు. (భాగ.7-11అ.8 మొదలు12 శ్లోకములు )

## 10 అసాధారణ (విశిష్ట) ధర్మములు

22. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్ర సంకరవర్ణములలో నాయా వర్ణములకు నాయా యాశ్రమములకుఁ బ్రత్యేకముగా నుండు ధర్మము లసాధారణము లనఁబడు. అవి మూఁడు తెఱంగులు, వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు, వర్ణాశ్రమ ధర్మములు. ,,మంత్ర పూర్వకంబుగ గర్భాదానాది సంస్కారములఁ బడసిన బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు ద్విజులనఁబడుదురు. అధ్యయనము (వేదము నర్థముతోఁ జదువుట)యజనము(యజ్ఞాదికర్మములను జేయుట),

దానము (ధనాదికము తగినవారికిచ్చుట,) అనునవియు ఆశ్రమోచిత కర్మంబులును, జన్మకర్మశుద్ధులైన ద్విజులకు విహితంబులును, అందు బ్రాహ్మణులకు నధ్యాపనము (వేదము నితరులకుఁ జెప్పుట), యాజనము (యజ్ఞాదికర్మములనుజేయించుట) ప్రతిగ్రహము (దానమును దీసికొనుట), జీవనాధారములగు వృత్తులు. రాజులకుఁ బ్రజాపాలనంబు విప్రేతరులవలనఁ బన్నులు మొదలగువానిఁ గొనుటయు నాపత్సమయంబున యాజనాధ్యాపనంబులును, వృత్తియగు. కాని ప్రతిగ్రహం బెన్నఁడును దగదు. కృషివాణిజ్యకుసీద గోరక్షణములు వైశ్యులకు వృత్తులు, శూద్రులకు ద్విజసేవ, ధర్మమును వృత్తులు. వీనిలోఁ గృష్యాదిజీవిక, అయాచిత ధనగ్రహణము, నిత్యధాన్యయాచన శిలోంఛవృత్తి (క్రిందఁబడిన గింజల నేరుకొనుట) యను నాలుగు బ్రాహ్మణులకు వృత్తులు. కలిలోఁగృష్యాదులు బ్రాహ్మణులకు వృత్తులు, అని పరాశరు లంగీకరించిరి. వాణిజ్యము, నీచసేవ (శ్వవృత్తి, అత్యంతనింద్యంబైన నీచసేవ) బ్రాహ్మణ క్షత్రియులకు నిత్యవర్జనీయంబులు. ఇంద్రియ మనోనిగ్రహము, తపము శౌచము, సంతోషము, పరాపరాధసహనము, ఆర్జవము, జ్ఞానము, దయ, విష్ణుపరత్వము, సత్యము, అనునవి బ్రాహ్మణలక్షణములు. యుద్ధోత్సాహము, ప్రభావము, ధైర్యము, ప్రాగల్భ్యము, దానము, ఆత్మజయము, క్షమ, బ్రాహ్మణ్యత, ప్రసాదరక్షణమనునవి, క్షత్రియలక్షణంబులు. దేవగుర్వాగ్య గోభక్తి త్రివర్గ పరితోషణమాస్తికత్వము, నిత్యోద్యమము,

నైపుణ్యము అనునవి వైశ్యలక్షణంబులు. వినయము, శౌచము, నిష్కపటమగు స్వామిసేవ, నమస్కార మంత్రము వ పంచయజ్ఞాచరణము, చౌర్యవర్జనము, గోవిప్రరక్షణము, అను నవి శూద్రలక్షణములు. పతిశుశ్రూష, తదనుకూలత్వము, తద్బాంధవానువర్తనము, తద్వ్రతధారణ నిత్యత్వమను నవి పతివ్రతాలక్షణములు. ఇల్లుఅలికి, ముగ్గుపెట్టి, ఓరుదీర్చి, యలంకరించి, గృహోపకరణంబులను నిర్మలములుగావించి, తాను నలుగుపెట్టుకొని, జలకమాడికొని, కట్టి, తొడిగి, పూసి, కైసేసికొని యలభ్యంబుల కాసింపక, లభించినమాత్రమునకు సంతసించుచు, నాలస్యంబును, ప్రమాదంబును, బరిహరించి, ధర్మమెఱింగి, ప్రియసత్యంబులనుడువుచు, శుచియై, స్నేహము, వినయము, శాంతియుం బెంపార నానా కామంబులతోఁ బతితుఁడుకొని పతిని పతివ్రతతఱిఁ నుపసర్పించుటధర్మంబు. శ్రీదేవి హరినెట్లో అట్లు హరిభావమునఁ పతినిగొల్చునతి హరితోడి శ్రీవిధమునం బుణ్యలోకమునఁ బతితో సుఖించు. అంత్యజులయిన రజకచర్మకారకనటబురుడ కైవర్తభిల్లులకును, సంత్యావసాయులయిన చండాలపుల్కస మాతంగాదులు మున్నగు సంకరజాతులకుఁ జోరత్వము, హింసాదిపాపవృత్తియుఁ దక్కకులాగత కృత్యంబులు వృత్తియగు. వేదధర్మములు ప్రతియుగమున వారి వారి స్వభావమున కనుగుణమ్ముగ విధించినధర్మమయ్యును వారికీలోకంబునను నాలోకంబునను సుఖము నాపాదించు. స్వభావముచేఁ దిరిగితిరిగి స్వధర్మంబు

నాచరించువాఁడు మెల్లమెల్లన స్వభావజనితసత్కర్మంబును బరిహరించి క్రమమున నైర్గుణ్యంబుఁగాంచు. ఎల్లప్పుడును బీజములు చల్లుచునేయుండినఁ గాలక్రమంబున నాక్షేత్రంబు నిర్వీర్యంబై ప్రరోహయోగ్యంబుగాక బీజములకే చేటుఁగావించువిధమునఁ గర్మములనే మీఁదుమిక్కిలి యనుష్ఠించుచుం గామములనే సేవించుచుండినం గ్రమంబునఁ గామాసక్తి వీడు. కామములును మొలువవు, మఱియును నాకామములును నశించు. ఘృతము మితముగఁ బోసిన యగ్ని ప్రజ్వరిల్లునుగాని యమితముగాఁబోసిన చల్లాఱునుగదా! ప్రకృతంబున కేలక్షణంబు చెప్పఁబడియె నయ్యది యితరములలోఁ గన్పట్టునేని దాన నతని తద్వర్ణయోగ్యుంగా నిర్దేశింపందగు. (భాగ 7 స్కం 11 అ 14 మొదలు 35 శ్లో॥ వఱకు). (ఆంధ్రవచన భాగవతము సప్తమ స్కంధములోని 206, 207 పుటలనుజూడుఁడు) ఈ వర్ణధర్మసంగ్రహమువలన మనమెఱుఁగఁదగిన యంశమేమనః— ప్రతియుగమునను ధర్మములు మారుననియు, ధర్మాచరణమునొక్క ముఖ్యోద్దేశము కామ్యకర్మమును వదలి నిష్కామకర్మమునాచరించి భగవదర్పణముగాని లోకోపకారముగాని చేసినఁగాని సత్ఫలము గలుగదనియు, తద్ద్వారా ముక్తియలవడుననియుఁ దేలును.

ఇందులకుఁ బ్రమాణము:—

నేహయత్కర్మ ధర్మాయ న విరాగాయ కల్పతే।
న తీర్థపదసేవాయై జీవన్నపి మృతో హి సః॥
(భాగ 3 స్కం 23 అ 56 శ్లో)

స్వభావజనితమైన కర్మమునను బనులు శాస్త్రవిహితమగు కర్మము నాచరింపవలయును. శాస్త్రోక్తములగు కామ్యకర్మములను వదలి నిత్యనైమిత్తిక కర్మములను, లౌకికకర్మములను, నహంకార మమకార ఫలాభిసంధులు లేక, యనుష్ఠింపవలయును. అట్లుకాని తీవ్రవైరాగ్యముదయింపదు. అట్టి విరాగముతో సర్వకర్మములు భగవదర్పణముగంగాని లోకసేవగంగాని చేయనిచో సత్వశుద్ధిగలుగనేరదు. చిత్తమలముపోయి శుద్ధసత్వము ప్రకాశించినంగాని జ్ఞానముదయింపదు. అది ప్రజ్వరిల్లినంగాని ముక్తియలవడదు. ఈన్యాయమే యాశ్రమ ధర్మములకు ననువర్తించును.

## 11 ఆశ్రమ ధర్మములు

23 బ్రాహ్మణాదులలో నాలుగాశ్రమములు:— బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము. ఉపనయనమైన పిదప నియమము ననుసరించిగురువునొద్ద వేదమును, తదంగములను, చదువుచుండుట బ్రహ్మచారిధర్మము. జీవితకాలమంతయు నట్లున్నయెడల వానిని నైష్ఠిక బ్రహ్మచారి యందురు. కొంతకాల మట్లుండి తర్వాతగృహస్థాశ్రమమును స్వీకరించువానిని ఉపకుర్వాణుండందురు. సాంగవేదాధ్యయనమును బూర్తిచేసి, పెండ్లిచేసికొని, స్వధర్మాచరణమునుజేయువాండు గృహస్థుండు. పుత్రోత్పత్త్యనంతరము వనవాసముంజేయుచు, ఫలాదులను భ

క్షీంపుచు, భగవదారాధనముఁజేయువాఁడు వానప్రస్థుఁడు. భార్యాదికమగు సర్వసంసారమును త్యజించి తలగొరిగించుకొని కావిరంగుగలను గోచిని పెట్టుకొని దండమును కమండలమునుధరించి, జనులు లేని చోట్లను, తీర్థములందునువసించి, గ్రామములలో భిక్షమెత్తి, భగవదారాధనమును మాత్రము చేయువాఁడు సన్యాసి. క్షత్రియ వైశ్యులకు మొదటి మూఁడాశ్రమములును, శూద్రునకు గృహస్థాశ్రమము మాత్రమును, విధింపఁబడినవని కొందఱిమతము. ఈశ్వరారాధనము సర్వవర్ణాశ్రమములకు సాధారణధర్మము. శ్రీ శంకరాచార్యులు క్షత్రియ వైశ్యులకు సన్యాసాశ్రమము కొన్ని శ్రుతులలోని లింగప్రమాణము ననుసరించి లేదన్నను, వారి శిష్యులగు శ్రీసురేశ్వరాచార్యులు బృహదారణ్య వార్తికములో న్యాయ రహితమగు లింగము ప్రమాణముకాదనియు, నితర శ్రుతులు కంఠోక్తిగ క్షత్రియ వైశ్యులకు సన్న్యాసము కలదని చెప్పుటచేతను, వారికి గూడ సన్న్యాసమున్నదని వ్రాసిరి. దానికి శ్రీఆనందగిరులు మహాభారత వాక్యమును బ్రమాణముగా నుదాహరించిరి. కొందఱు స్మృతికర్తలట్లు తలంచిరి. భాగవతములోఁగొందఱు క్షత్రియులు సన్న్యాసమును స్వీకరించినట్లున్నది. బుద్ధగయయందున్న ఆనందగిరి మఠములోని మఠాధిపతియగు సన్న్యాసి పూర్వాశ్రమమందు క్షత్రియుఁడనని నాతో 1894 సంవత్సరమునఁ దెలిపియుండెను. శూద్రులలో వైరాగులు పండారులు అను సన్న్యాసులు గలరు. వారాగమప్రమాణికులు

గాని, శ్రుతిస్మృతుల ననుసరించినవారు కారు. సిక్కుల సాంప్రదాయము శైవదీక్షలో నగుచున్నది ననుసరించినది,

# 12 ఆశ్రమాంతర భేదములు

24 బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాసాశ్రమములలోఁ బ్రత్యేక మొక్కొక్కదానిలో నాలుగు భేదములుగానుండి 16 భేదములు గలవని మహాభారతములోను, కాత్యాయనస్మృతిలోను, నున్నది. బ్రహ్మచారులు గాయత్రి, బ్రహ్మ, ప్రాజాపత్య, (బృహాన్) నైష్ఠికులని, నాలుగు తెఱంగులు. 1 ఉపనయనానంతరము క్షారలవణముల వర్జించి మూఁడు రాత్రు లన్నముఁదిని గాయత్రి నుపాసించు బ్రహ్మచారి గాయత్రుఁడు. వాఁడు 48 ఏండ్లు వేదమును జదువుచు బ్రహ్మచర్యము జరుపవలయును. 2. 12 లేక 10 సార్లుగాని యర్థముతోఁ గూడవచ్చువఱకుఁ గాని వేదముచదువువాఁడు బ్రాహ్మఁడు. 3 తన భార్యలో ఋతుకాల మందు మాత్రమే సంగముచేయుచు నితరుల భార్యల నెప్పుడును చూడకుండువాఁడు ప్రాజాపత్యుఁడు, 4 చనిపోవువఱకు గురువులను వదలక వారియొద్దనే యుండువాఁడు నైష్ఠికుడు, లేక బ్రహ్మనైష్ఠికుఁడు. గృహస్థులు వార్తాక, శాలీనవృత్తి, యాయవర, ఘోరసన్యాసికులని నాలుగు తెఱంగులు. 1. వ్యవసాయము గోరక్షణము వర్తకము భూతములకు హింసలేకుండ నాచరింపుచు నూరేండ్లు కర్మములను జేయుచు

నాత్మను బాధ్రించువాఁడు వార్తాకవృత్తుఁడు 2. కర్మము లనుజేయుచు నితరులకుఁ జేయింపకయు వేదమును జదువుచు నితరులకు వేదముఁ జెప్పకయు నితరులకు దానముఁజేయుచు దాను దానముఁ బట్టకయు నూరేండ్లు కర్మములను జేయుచు నాత్మను బాధ్రించువాఁడు శాలీనవృత్తుఁడు. 3 కర్మములఁ జేయుచు వేదములను జదువుచు నితరులకుఁజెప్పుచు దాన మిచ్చుచుఁ బుచ్చుకొనుచునుండి నూరేండ్లు కర్మములఁజేయు చునాత్మను బాధ్రించువాఁడు యాయావరుఁడు. 4. తనకుఁ గావలసిన నీళ్లను తానే తోడుకొని, నియత కర్మములను నిర్వర్తించుకొనుచు, బ్రతిదినమును దన త్రావును తానే బాగుచేసికొనుచు, ఉంఛవృత్తి నాచరించుచు నూరేండ్లుకర్మ ములను జేయుచు నాత్మను బాధ్రించువాఁడు ఘోర సన్యాసికుఁడు. వానప్రస్థులు, వైఖానస, ఔదుంబర, వాలఖిల్య, ఫేనపులని నాలుగు తెఱంగులు:— 1 మనుష్యు లచే నాటఁబడని యోషధులవలనఁ బుట్టిన ధుంపలను, వృక్షముల వలనఁ బుట్టినఁ ఫలములను, ఊరిబయలున వండి పంచమహా యజ్ఞములను నిత్యకర్మలను జేయుచు నాత్మను బాధ్రించువాఁడు వైఖానసుఁడు. 2. రేగులు నీవారములు మున్నగు గింజలను వండి, పంచమహా యజ్ఞములను జేయుచు, నాత్మను బాధ్రించువాఁడు, ఔదుం బరుఁడు. 3 జడలను ధరించి నారచీరెలను, తోళ్లచెరళ్లను కట్టుకొని, కార్తీకపూర్ణిమనాఁ డదివఱకు సేకరించిన ధాన్య మును వదలి తిరిగి క్రొత్తదాని నార్జించి మిగిలినమొనిమిదినెల

లకు నుంచుకొని పంచమహాయజ్ఞములను జేయుచు, నాత్మను బ్రాథ్రింనువాఁడు వాలఖిల్యుఁడు 4 వాడిన యాకులను బండ్లను దిని యెక్కడనైన నుండువాఁడు ఫేనపుఁడు. సన్న్యాసులు, కుటీచక, బహూదక, హంస, పరమహంసలని, నాలుగు తెఱంగులు:— 1 తన కొడుకుల యిండ్లలో భిక్షమెత్తుచు, నాత్మను బ్రాథ్రించువాఁడు కుటీచకుఁడు. 2 త్రిదండమును కమండలమును, పవిత్రములగు పాదుకలను దర్భాసనాదులను శిఖా యజ్ఞోపవీతములను కాషాయములను ధరించి సాధువులగు బ్రాహ్మణుల గృహములందు భిక్షనుజేయుచు నాత్మను బ్రాథ్రించువాఁడు బహూదకుఁడు. 3 ఒక్క దండమును మాత్రమే పట్టుకొని శిఖా యజ్ఞోపవీతములను ధరించి కమండలువును జేతిలో తీసికొని ఒక్కొక్కరాత్రి నొక్కొక్కయూరని వసించుచు, బుణ్యక్షేత్రములయందెనిమిది గాని ఇయిదుగాని దినములుండుచు, నొక రాత్రిగాని రెండు రాత్రులుగాని కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తములను జేయుచు, నాత్మను బ్రాథ్రించువాఁడు హంస. 4 ఒకదండమును బొంతను గోచిని ధరించి యాశ్రమ చిహ్నములను కనఁబఱచుచు (బిచ్చివాఁడు కాకున్నను పిచ్చివానివలె నుండుచు త్రిదండ కమలమును, ఉట్టిని, తన కాలిపీఁటిచేఁ బవిత్రములగు పాదుకలను, దర్భాద్యాసనములను శిఖా యజ్ఞోపవీతములను వదలి పాడు కొంపలలోను, గుళ్లలోను బస జేయుచు ధర్మాధర్మములను గాని సత్యాసత్యములను గాని లక్ష్యపెట్టక సర్వవిధముల శీతోష్ణ సుఖదుఃఖాదులను సహించి

చుచు, మంటిబెడ్డ, ఱాయి, బంగారు, లోనగు వానియందు సమత్వబుద్ధిగలిగి లోకములో నున్న బ్రాహ్మణాది నాలుగు వర్ణములలో భిక్షఁజేయుచు నాత్మకుయోగక్షేమసంపాదనముఁ జేయువాఁడు పరమహంస. బ్రహ్మపురాణాదులలో వాన ప్రస్థ సన్న్యాసములను కలియుగంబున వర్జింపఁదగునని చెప్పి నను స్మృతికంటె శ్రుతియెక్కువ ప్రమాణముగలదని యెంచి శంకరరామానుజ మధ్వాచార్యాదులు సన్న్యాసము నంగీక రించిరి. ఇప్పటికిని బరమహంసలగు నద్వైతులు, ద్వైతులును, శిఖా యజ్ఞోపవీతములు గల కుటీచక బహూదకులగు విశిష్టా ద్వైతులు,నునున్నారు. వానప్రస్థులు మాత్రములేరు.

# 13 వర్ణాశ్రమ ధర్మవిశేషములు

25 బ్రాహ్మణ వర్ణములోఁ బుట్టి గృహస్థాశ్రమమునం దున్నవాఁడు మాత్రమే బృహస్పతి సవమను కర్మముఁ జేయ నగుఁగాని క్షత్రియ గృహస్థుఁడుగాని వైశ్యగృహస్థుఁడుగాని చేయఁగూడదు. అట్లే క్షత్రియగృహస్థునకే రాజసూయ యాగము విహితముగాని లాతి యిరువురకుఁగాదు. అట్లే వైశ్యస్తోమమను క్రతువును వైశ్యగృహస్థుఁడు మాత్రమే చేయనగుఁగాని యితరులు చేయరాదు. ఇట్లే ఉపనయ నాది సంస్కారములలోఁ గూడ ద్విజత్రయములోఁగూడ భిన్నధర్మములుగలవు. వేదశాఖ లనేకములుండుటచే నాయాశాఖాధ్యేతలగు వారికి భిన్న భిన్న ధర్మములుగలవు.

# 14 వర్ణాశ్రమ ధర్మ సూక్ష్మములు

26 పూర్వయుగములలోఁ గొందఱు పెద్దలాచరించిన ధర్మములు పరాశరాది ధర్మశాస్త్రముల నతిక్రమించుచున్నవి. క్షత్రియులగు శ్రీరామచంద్రులు నీచజాతియగు శబరియొక్క యాతిథ్యము నంగీకరించుటయు, శ్రీబలరామ కృష్ణులు క్షత్రియులైనను వైశ్యుఁడగు నందునింట 10, 11 ఏండ్లు పెరుగుటయు, విదురాదుల యింటఁగుడుచుట క్షత్రియులు బ్రాహ్మణుల కన్నాదులను వడ్డించుటయు, లోనుగాఁగల దృష్టాంతములు స్మృతిపురాణేతిహాసములలో మెండుగాఁగలవు. పూర్వయుగములలో బ్రాహ్మణులు క్షత్రియులు కలిసి తిన్నట్లును, బ్రాహ్మణులుగూడ గోఛాగాదిభక్షకులయినట్లును నున్నది. ద్వాపరకలి సంధిలో నుదయించిన కృపద్రోణాశ్వత్థామాచార్యులు బ్రాహ్మణవర్ణులయినను వాయుధీయకమే (అస్త్రశస్త్రవిద్య) వారి వృత్తియైనందులకు భారతము ప్రమాణము. అదివారికి నాపద్ధర్మము గాదు. ద్రోణాచార్యులకు ద్రుపదరాజు రాజ్యమగు పాంచాలములోని సగము వారి శిష్యోత్తముఁడగు నర్జునుఁడు గురుదక్షిణగా నీయగ నాచార్యులు దానిని బాలింపలేదా! కురుపాండవులకు గురువులు, బ్రాహ్మణులునగు ద్రోణ కృపాశ్వత్థామా చార్యులు తమ ధర్మము కానిదియు బరధర్మము, నధర్మయుక్తమునగు, యుద్ధమును గావింపలేదా! అదిధర్మమా? ధర్మాభాసమా! అశ్వత్థామ రాత్రి నిద్రించుచున్న పాండవసేననుజంపుటయు,

నపాండవమును గావింప నస్త్రమును బ్రయోగించుటయు, ధర్మమా? అధర్మమా! ఇట్టి ధర్మాభాసములు భారతాదులలోఁ జాల పొడకట్టును. ద్వాపరాంతములో మత్స్యగంధియందు శ్రీపరాశరులకు శ్రీవేదవ్యాసులుదయించినను బీజప్రభావముచే శ్రీఋష్యశృంగునివలె విప్రుఁగనే పరిగణింపఁబడెను. క్షేత్రజులగు పాండవులు దేవబీజోత్పన్నులయినను తల్లిదియగు క్షత్రియకులమువారుగా నెన్నఁబడిరి. తపోబలాదులచే విశ్వామిత్ర మరుదేవాపి లోనగు క్షత్రియులొక జన్మమందే రాజర్షులుగను, బ్రహ్మర్షులుగను గణనముఁ జేయఁబడిరి. నహుషునకొక జన్మములోననే యుత్కృష్టాపకర్ష జంతుత్వములభించెను. నాభాగపుత్రులు జన్మముచే క్షత్రియులయినను వృత్తిచే వైశ్యులయినట్లు భాగవతములో నున్నది. కసాయివృత్తినాచరించు ధర్మవ్యాధుఁడు బ్రాహ్మణున కధ్యాత్మ గురువైనట్లు వనపర్వములో వివరింపఁబడినది. ఇట్టి ధర్మసూక్ష్మము లనేకములు మన ప్రాచీన మత గ్రంథములందుఁ గలవు. మఱియు శల్యకర్ణ సంవాదము వలనను మద్రాంగాది దేశములలో వివాహనియమాదులులేవనియు, తరుచుగ నాదేశస్థులు స్త్రీసంగులు, పానాసక్తులనియు, మ్లేచ్ఛాచారపరులనియు, స్పష్టపడగలదు. ధనుశ్శాస్త్రపరీక్షలో (ఆదిపర్వము 136_137 అ) కృపాచార్యుఁడు కర్ణుని వర్ణమడుగ దుర్యోధనుఁడు రాజులకుసత్కులీనము, శూరత్వము, సేనలను నడుపుట,యునను మూఁడు కారణములని చెప్పెను. కర్ణుఁడు బదులుచెప్పక తలవంచఁగ దుర్యో

ధనుఁడు కర్ణున కంగరాజ్యాభిషేకముఁ జేసి యతనిని రాజును జేసెను. అంత భీమసేనుఁడు కర్ణుఁడు సూతపుత్రుఁడనియు, యుద్ధముఁ జేయుటకును, రాజ్యముఁ జేయుటకును నతఁడు దగడనియు, నతనిధర్మము సారథ్యమనియు, నధిక్షేపింపఁ గర్ణుఁడు నిర్విణ్ణుఁడై యూరకుండెను. అందులకు దుర్యోధనుఁడిట్లుత్తరమిచ్చెను. "నదీమూలము వలెరాజులచరిత్రము గుప్తము, జగత్తును మ్రింగు బడబాగ్నిజలమునఁబుట్టును. దానవునిజంపువిల్లు మర్త్యుఁడగు దధీచియొక్క వెన్నెముక వలనఁ జేయఁబడినది. సర్వదేవతల శక్తిఁగలిగిన కుమారస్వామి యుత్పత్తి తెలియదు. కొందఱగ్నికిఁబుట్టెననియు, కొందఱు కృత్తికనియు, కొందఱు రుద్రదేవునికనియుఁ, గొందఱు గంగాదేవికనియుఁ బల్కుదురు. క్షత్రియులలోఁ బుట్టినవారు బ్రాహ్మణులయినట్లు విన్నారము. విశ్వామిత్రులగు జాతిక్షత్రియులు బ్రాహ్మణ్యముఁ బొందిరి. కురువులకు గురువులగు ద్రోణాచార్యులు మూసికలోఁబుట్టిరి. కృపాచార్యులు గడ్డిదుబ్బులోఁబుట్టెను. మీ (పాండవుల) జన్మకారణము నాకుఁ దెలియును. అస్త్రశస్త్రకౌశలముచే గర్ణుఁడంగదేశమునకేగాదు జగత్తునకంతయు నధిపతిగా నుండ నోపు". కావుననే నహుషునకు ధర్మరాజు మనుష్యులలో వర్ణసూచకములగు గుణకర్మములులోపించినవనియు, బ్రాహ్మణగుణము లితరవర్ణముల యందును, లాతివర్ణ గుణములు విప్రులలోను గనుపడుచున్నవనియు, వర్ణసంకరము కనుపించుచున్నదనియు, వృత్తము అన ప్రవర్తనములేనిచో సర్వులు

శూద్రప్రాయు లనియుఁ దెలియఁదగునని చెప్పెను. (భా. వనపర్వము 180 అ.)

## 15 వర్ణాశ్రమాభాసములు

27. కాన ద్వాపరాంతమునుండి వర్ణాశ్రమ ధర్మములలోఁ గొన్ని మన్వాది శాస్త్రానుగుణముగ నున్నట్టు లగపడవు. పిదప రాను రాను క్షత్రియప్రభువులు క్షీణించుటచేతను, బ్రాహ్మణాదులార్యావర్తమునువదలి వింధ్యదక్షిణమున వ్యాపించుటచేతను, గురువులుగా నుండవలసిన బ్రాహ్మణులు, అర్థకామపరులై ధర్మమునంతగఁ బాటింపక పోవుటచేతను, బౌద్ధయవన మ్లేచ్ఛప్రభుత్వములు, ద్రావిడ సాంగత్యములు, వృద్ధి కాగను, బౌద్ధజైనమ్లేచ్ఛ సిక్కు క్రైస్తుమతాదుల వ్యాప్తివలనను, దేశికులగృహాచారములు క్రమముగా మారి పూర్వధర్మములలో వ్యత్యయముఁగలిగించెను. జనుల ధర్మములు దేశకాలనిమిత్తానుగుణమున తప్పక మారును. వానిమార్పు నీరుపల్లమును వెదకునట్లు స్వభావసిద్ధము. గుణకర్మమువలనఁ బుట్టిన వర్ణములకు రానురాను ధర్మచ్యుతి కలిగెను. దేశకాలనిమిత్తములచే స్మృతిసూత్రకారులు ధర్మవ్యవస్థ నప్పుడప్పుడు చేయుటకు వాని మారుదలయే కారణము. "ధర్మజ్ఞసమయః ప్రమాణంవేదాశ్చ" అని ధర్మముదెలిసి వారి కట్టుబాటు వేదమువలె ప్రమాణమని సూత్రకారులు సెలవిచ్చిరి. కాననే ప్రబలవ్యాప్తిగల యాచా

రములను శిష్టులంగీకరించుటచే నవి శాస్త్రవిరుద్ధములైననూ వానిని ధర్మములుగా స్వీకరింపవలయునని బోధాయనమహర్షులు 2500 ఏండ్లక్రింద నుడివెను. అట్లే గౌతమాపస్తంబాశ్వలాయనకాత్యాయనాదిఋషులితరాచారములనుగూడ మన్నించిరి. తర్వాతఁగూడ 24 గురు ధర్మశాస్త్రజ్ఞులు తైత్తిరీయ శిక్షావల్ల్యుపాంత్యానువాకాదుల ననుసరించి ధర్మసంగ్రహమునుజేసిరి. పిదప బంగాళాంధ్రదేశములకు జగన్నాథాదులును, గుజరాతీ మహారాష్ట్రములకు మయూఖాకారాదులును, నితరహిందూస్థానమునకు విజ్ఞానేశ్వర మాధవాచార్యులును, స్మృతులలోని యాచారవ్యవహార ప్రాయశ్చిత్తకాండములనన్నింటికిఁ గాని లేక కొన్నింటికిఁగాని వ్యాఖ్యలనుజేసి వానిలో నప్పటి శిష్టాచారములను గలిపిరి. అంతకుముందే బహ్వాచార భేదములచే బ్రాహ్మణులు గౌడులనియు ద్రావిడులనియు విభక్తులైరి. ఆయుభయ దేశములమధ్యను వింధ్యపర్వతముగలదు. దానికి నుత్తరముననున్నవారి నౌత్తరీయులనియు, దక్షిణముననున్న వారిని దాక్షిణాత్యులనియు, ననియెదరు. ఈయాచారములలోఁ బ్రాచీనములగు కొన్నింటిని ఆర్యదేశాచారములను శీర్షకక్రింద నీవ్యాసారంభమున సంగ్రహించి నాఁడను. వానిప్రచారము బోధాయన కాలమునకుఁబూర్వమునుండి నేటివఱకుఁగలదు. వానిని మాధవాచార్యులు 600 యేండ్లక్రిందననువదించి యంగీకరించిరి. అట్లే కర్ణాటక మహారాష్ట్రాంధ్రదిశిష్టులంగీకరించిన మేనఱికము లోనగు వివాహాచారములు, ఋ

శ్వేదగతసర్పసూక్తము ననుసరించి స్మృతులకు వ్యతిరేకము లైనను, మాధవాచార్యులు వానిని సమర్థించిరి. కానియాయుర్వేదజ్ఞులును, దేశస్థులలో దేహపాటవముండుట యావశ్యకమనువారును, సోత్తరీయులును, వానినొప్పరు. అరవద్రావిడులలోఁగూడ నీయాచారము ద్రావ్యాశాదులచేఁ బ్రవేశించినదని వగచుచున్నాఁడను. కనుకనే ప్రాయికముగ పంచద్రావిడుల కంటె గౌడులలో కాయపుష్టిగలవారు మెండు. మఱియు నేపాళములో మహిషమాంసమును బ్రాహ్మణులు భక్షింతురఁట. కాశ్మీర దేశములో మహమ్మదీయులు హిందువుల సేవకులు. వారు వంటఁజేసినచో బ్రాహ్మణులు వైశ్యదేశమునుజేసి భుజించెదరఁట. పూర్వము శూద్రులు వండినచో విప్రులు వైశ్యదేవమును జేయునగునను నాపస్తంబవాక్యమువలె నీయాచార మిప్పుడున్నది. ఓఢ్రబంగాళ మైథిలీబ్రాహ్మణులు మత్స్యాదులను, బంగాళములో శక్తి పూజను జేయు విప్రులు మేకమాంసమును, దినియెదరు. సింధుదేశములో వైశ్యులు బ్రాహ్మణక్షత్రియులకు వంటఁ జేయుదురు. ఓఢ్రదేశపు బ్రాహ్మణులలో నొకతెగవారు బ్రాహ్మణేతరులకు వంటఁ జేయుదురు. ఉత్తరపశ్చిమదేశములలో భోజనకాలమందువిప్రులకు దృష్టిదోషము లేదు. పూటకూళ్లలో దక్షిణహిందూ దేశములోఁగూడ దృష్టిదోషములేదు. ఇప్పుడు లౌకికవ్యవహారాది నిమిత్తము ప్రయాణవ్యాపకము సీమయాత్రలు, 'టీపార్టీలు,' 'అట్హోములు,' లౌకికవిందులు, Cosmopolitan విందులు

ఎక్కువకాఁగాను, వైష్ణవగయిరాలలోను కాంగ్రెస్సు వగయిరా మనదేశ సమావేశములలోను, గాంధీమహాత్మాదుల బోధాచరణాదుల వలనను, దృష్టిదోషము లేనే లేదు. శ్రీజగన్నాథములో వర్ణవిచక్షణ లేకయు, నెంగిలిలేకయు, స్వామిప్రసాదమును నాలుగు వర్ణములవారు స్వీకరింతురు. మాళ్వా లోనగు ప్రదేశములలో, తోళ్ళతిత్తులలోని నీఁటిని బ్రాహ్మణాదులు, ప్రకృతపు కొళాయి నీరువలె, గ్రహింతురు. ఉత్తర దేశములో బ్రాహ్మణేతరులు తెచ్చిననీఁటిని విప్రులువాడుదురు. ముట్టయినస్త్రీని మహారాష్ట్ర దేశములో దూరముగనుంచరు. మడిబట్టఁ గట్టుట దేహశౌచము నిమిత్తమేర్పడినను దాని విషయములో ఆంధ్ర ద్రావిడ గౌడాదులలో భిన్నాచారములు గలవు. విచారించినచో నన్నింటిలోను లోపములు గననగు. దక్షిణవైష్ణవాద్యాలయములలో నున్న అన్నవినియోగము, అన్నవిక్రయము, నెంతటి యనాచారమునకును, దుర్వృత్తమునకును, దావిచ్చుచున్నదో వివేకులరయనగు. ఉత్తరదేవాలయములలో నున్న సత్త్వభక్తివిరక్తి హేతువులు, దక్షిణదేవతాగృహములందుఁ గానరావు. రాజసతామసవికారములుమెండుగఁబొడకట్టును, కాన శోచనీయము. ప్రవృత్తియని సాకుబెట్టికొని శ్రౌతస్మార్తాది కర్మలకుఁ బ్రయోజనము లేదని వానికి నున్నఁజుట్టి సర్వఫలములు దేవాలయములోని యర్చావిగ్రహపూజవలననే లభ్యములని, ద్రవిడప్రబంధ రహస్యార్థము నెఱుగక ప్రవర్తించువారి మోహమేమని చెప్పవచ్చును?

మఱియుఁ బరమతస్థులగు రాజులు మన రాజ్యపాలనముఁ జేయుటచేతను, శైవశాక్తవైష్ణవాద్యాగమ ప్రాబల్యము చేతను, బ్రాహ్మణాదులు సదృష్టమగు పరలోక ఫలముకంటె దృష్టమగు నీలోకఫలమునే యెక్కువగఁ గోరుటచేతను, విప్రులకు ద్రవ్యఖ్యాతి పూజాధికారములం దాసక్తి హెచ్చగుటచేతను, వేదశాస్త్రాది విద్యలను నాయాచారములను వదలి క్రొత్తత్రోవలందొక్కిరి. కావననే 'నందాంతం క్షత్రియ కులం' అని పురాణములలో నుండుటను బట్టియు, పూర్వ క్షత్రియు లిప్పటికి షుమారు 2300 ఏండ్లక్రిందట నంతరించినట్లగపడును. 600 ఏండ్లక్రింద మాధవాచార్యులు, శ్రుతిస్మృతి సూత్రాదులలోఁ జెప్పిన ముఖ్యబ్రాహ్మణులు, ముఖ్యశూద్రులు, లేరనియు, క్షత్రియవైశ్యుల స్వరూపమే లేదనియు, పరాశరస్మృతి వ్యాఖ్యలో స్పష్టముగా వ్రాసిరి. ఇప్పటికి షుమారు 200 ఏండ్లక్రింద వేంకటాధ్వరులు విశ్వగుణాదర్శములోని భారతదేశముల వివిధాచారముల వర్ణనముఁజూడనింక పెక్కు వ్యత్యయములగపడు. అప్పుడు 'ఉర్దూ' భాషకును, ఇప్పుడు 'ఇంగ్లీషు' భాషకును వ్యాప్తి. అప్పుడు తురకలు, ఇప్పుడింగ్లీషువారు, ప్రభువులు. మఱియు రాజరాజనరేంద్రుని కాలమునుండి ఆంధ్రదేశములో సంస్కృతముకంటె తెలుగుచదువునకు వ్యాప్తి మెండుగ నుండెను. ప్రాచీన విద్యాచారములు హిందూదేశమందంతటను మారుటకు నింకనొక ప్రబలకారణము గలదు. బౌద్ధమతస్థులను మన దేశములోనుండి తరిమినప్పటినుండి పురాణాగ

మాదుల వ్యాప్తి యిప్పటికి 2000 ఏండ్లనుండి హెచ్చి వివిధాచారములు ప్రబలి పూర్వాచారములలోఁ గొన్నిటిని గప్పి గొన్నింటిని మార్చినవి. బౌద్ధకాలము (బి. సి. 500 ఏండ్లనుండి ఏ. డి. 200) వఱకు దేశభాషల ప్రాబల్యము, శూద్రప్రాయులగు క్షత్రియేతరుల రాజ్యపాలనము, హెచ్చెను. 1500 ఏండ్లనుండి వైదికులగు ద్రవిడ, టంక, భర్తృప్రపంచ, కుమారిల, శంకర, రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, విజ్ఞానభిక్షు లోనగు మతాచార్యులును వారి శిష్యప్రశిష్యులును వేదవేదాంతములకు భిన్నభిన్నార్థములను వ్రాసి వానిని వ్యాపింపఁజేయుటచేఁ గర్మవిషయములోఁగూడ వారి యనుయాయులు భిన్నమార్గస్థులైరి. దానిచే వర్ణాశ్రమధర్మములు మారినవి. 1000 ఏండ్లనుండి మనదేశమున భక్తులను దాసకూటము బయలు వెడలి, భక్తి జ్ఞాన వైరాగ్య లోకోపకారములను పట్టింపని కేవల శ్రౌత స్మార్తాదికర్మములను నిరసించి, దైవభక్తిని లోకసేవను, వృద్ధిపఱచిరి. ఉత్తరహిందూస్థానమున గురునానక్, తులసీదాసు, కమాల్ దాసు, శ్రీకృష్ణచైతన్యులు, లోనగువా రుదయించి, కొందఱు వేదభిన్నధర్మములను, గొందఱేక వర్ణమును జెప్పి, కర్మముకంటె భక్తిజ్ఞానవైరాగ్యములే మోక్షదాయకములనియు, వర్ణవిభాగమంతగ గమనింపఁగూడదనియు, బోధించిరి. అట్లే మహారాష్ట్రములో నివృత్తి, సోపానుఁడు, ముక్తాబాయి, జాని, అక్కాబాయి, వేణుబాయి, నామదేవుఁడు, ఏకనాథుఁడు, రామదాసస్వామి, తుకారాం,

షేకుమహమ్మదు, దామాజి, చొక్కమేళ, నరహరి, సోమనాథుడు, మున్నగువారు బోధించిరి. ఆంధ్రదేశములో వేమన, రామదాసు, నృసింహదాసు, నిట్టలప్రకాశదాసు, రంగదాసు, లోనగు వారి చర్యలు గూడ నట్లే పరిణమించినవి. ద్రవిడదేశములో నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తొండరప్పొడియాళ్వారు, తిరుమంగయాళ్వారు, లోనగు వైష్ణవాగ్రేసరులు,అప్పరు,అవ్వార్, మాణిక్యవాచకర్, సుందరర్, తాయుమానవర్, లోనగు శైవభక్తులు, కన్నడదేశములోని పురందరదాసు, జగన్నాథదాసు, కనకదాసు, బసవేశ్వరుడు లోనగు విష్ణుశివభక్తులు, దేశభాషలలో గద్యపద్య యక్షగానములలో బోధించిరి. ఇట్లే ద్వైతాద్వైతవిశిష్టాద్వైతశైవాదిమతములనువ్యాపింపజేయు బ్రహ్మక్షత్రియాది పీఠస్థులుగూడ పూర్వకర్మములను వారి మతాచారముల కనుకూలముగ మార్చిరి. ద్రావిడ దేశములో శూద్రులగు పండారపీఠస్థులు శైవాగమములను, కన్నడ తెలుగు దేశములలోనున్న శూద్రులగు వీరశైవపీఠస్థులు శైవదీక్షలను, వ్యాపింపజేసి, శ్రౌతస్మార్తాది కర్మములను మార్చిరి. భక్తిప్రపత్తిమార్గములకు వ్యాప్తి యిన్ని కారణములచే నెక్కువయయ్యెను. ఈభక్తుల మతవ్యాప్తియు, దీనికిముందున్న బౌద్ధజైనాది మతవ్యాప్తియు, దానికి ముందున్న భారత భాగవతాదుల వ్యాప్తియు, హింసాపూర్వకములగు శ్రౌత కర్మములకంటె నహింసారూపకములగు శ్రవణకీర్తనజప స్మరణాదులు, హరిహరాదిభక్తిబోధకములయందు నమ్మక

మును గలిగించెను. కావునే శంకరరామానుజ మధ్వశుకా చార్యులు బ్రహ్మమీమాంసలోని 'అశుద్ధమితి చేన్న శబ్దాత్' అనుసూత్రమున కర్థము హింసాపూర్వకమగు శ్రౌతకర్మము, వేదప్రమాణము గలదిగాన జేయనగునని వ్రాసినను, మాధ్వులు పిష్టపశువుతో యజ్ఞములను జేయుచున్నారు. తెంగలి వైష్ణవవల్లభీయులు వానిని చేయుటలేదు. ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతవ్యాప్తి ప్రబలముగాఁగ నామతస్థులలో దేశాదినిమిత్తములచే భిన్నాచారములెక్కువయి, పెక్కు నిబంధనగ్రంథములు ప్రబలినవి. నిర్ణయసింధువు, ధర్మసింధువు, హేమాద్రి కమలాకరము, వైద్యనాథదీక్షితీయము, ఆనందాక్ష పిళ్ళ, తోడప్పర్ స్మృతి లోనగునవి దృష్టాంతములు. ఇవి బయలువెడలఁగ ఆంధ్రమహారాష్ట్ర కర్ణాట ద్రవిడదేశములలోని శిష్టులు వీనినంగీకరించుటచే నూతనాచారములు ధర్మములుగ నెన్నఁబడినటులు ప్రకటనము చేయఁబడెను. తర్వాత రానురాను ప్రాచీనాచారములు మారినవి. చాళుక్యతురుష్కుల ప్రభుత్వకాలమునుండి వారి వ్యవహారము ఆంధ్రదేశములో బ్రాహ్మణాదులు సాగించుటచే లౌకికవృత్తిలోఁ బ్రవేశించిన కొందఱు బ్రాహ్మణులధ్యాపనయాజన ప్రతిగ్రహములగు మూఁడు జీవికలనువదలిరి. వారి జీవనము దేశప్రభుల సేవవలన జరుగుచుండుటచే నాకర్మలను వీడిరి. వారును వారిసంతతివారును వారియనుయాయులును రెడ్లక్రిందను, ఇతరమ్లేచ్ఛరాజులక్రిందను రాజ్యతంత్రములలోను, సేనాధిపత్యములలోను, దేశపాండ

మొదలు గ్రామకరణీకములకు నుండు నుద్యోగములలోఁ బ్రవేశించి మనదేశమున కభివృద్ధిని జేసిరి. వారినే నియోగి బ్రాహ్మణులందురు. ఇంగ్లీషు ప్రభుత్వము వచ్చినపిదప నితరబ్రాహ్మణులగు వైదికులుగూడ నింగ్లీషును జదివి లౌకికోద్యోగులలోను ప్లీడరు మొదలగు ప్రాడ్వివాకపదవులలోనుకృషివర్తకవ్యాపారములలోనుఁ బ్రవేశించుటచేనిప్పుడు లౌకికకార్యములలో మెలఁగు బ్రాహ్మణులలో వైదికులు నియోగులునను భేదము నామమాత్రావశిష్టమైనది. వేద శాస్త్రసంపన్నులగు వైదికులపిల్లలింగ్లీషునభ్యసించి లౌకిక కార్యములు సేయుట ప్రతిదినము మనము చూచుచున్నారముగదా! మఱియు బ్రాహ్మణులందఱు నొకవర్ణమువారైనను దేశభాషాచారములు భిన్నములగుటచేతను, నొక భాషను మాటాడువారిలోనే వివాహాది సంబంధమును భిన్నభిన్నముగఁ జేయుచువచ్చినారు. మఱియు నాంధ్రబ్రాహ్మణులలో నుండు నవాంతరదేశములను బురస్కరించుకొని వేఁగినాడు, వెలినాడు, తెలుఁగునాఁడు, ములికినాఁడు, కాసలనాఁడు లోనగు భేదములు స్వల్పాచారభేదములగుటచేఁ గలిగి వివాహాదిసంబంధముల నేనాఁడివారానాఁడియందే చేయుదురు. వానిలో నవాంతరభేదములుగలవు. వీరు నియోగి బ్రాహ్మణులతో సంబంధమునుజేయరు. నియోగులలో నారువేలవారు, పాకనాటివారు, అని రెండుతెగలవారు పరస్పరము సంబంధముఁ జేయలేదు. ఇప్పుడు విరళముగఁ జేయుచున్నారు. ఆరు వేల వారి యాఁడు పిల్లలను

గోలకొండ వ్యాపారులగు తెలగాణ్యానియోగులకును, శ్రీవైష్ణవులకును, మాధ్వులకును, నిత్తూరు కాని కొన్నియేండ్లనుండి పలఘాటుపిల్లలను ఆంధ్ర వైదికబ్రాహ్మణులు కొని పెండ్లి చేసికొనుచున్నారు. మఱియు నీవైదికుల పిల్లలను నియోగ్యాగిబ్రాహ్మణులకియ్యరు. శ్రీవైష్ణవబ్రాహ్మణులు తెనుంగేమాట్లాడినను ద్రావిడులు నాంధ్రులు నను రెండుతెగలుగానుందురు. వారిలో 'వడి' సంఘము అను నవాంతర భేదములనేకములుండుటచేఁబరస్పరము భోజనమును సంబంధమును జేయరు. మాధ్వులలో గృహస్థులు, ఆచార్యులు, అను భేదమున్నను భోజనసంబంధములు గలుగును. 'సంగి సంగు'లను వారుమాత్రము స్మార్తాదిగంధమంటరు. అష్టసంబి, తంబళలలోను భేదములుగలవు. శూద్రులలో వెలమ, కమ్మ, కాపు, తెలగ, బలిజ, సెట్టిబలిజ, లింగబలిజ, జంగము, సాతాని, ముతరాసు, రెడ్డి, రెడ్డిక, కాళంగి, బేదర, గొల్ల, గాజులు, గౌండ్ల, ఈడిగ, జాండ్రి, సాలి, పట్టుసాలి, పల్లె, మరకాండ్రు, బోగము, జక్కుల, సాని, చాకలి, మంగలి, బోయ, మేదర, యానాది, ఎఱుకల, లోనగువలు, తెగలు, నాచారములును గలవు. కంసాలి, కంచర, వడ్రంగి, చిత్రకారులగు ముచ్చెవారు, రంగిరేజు, లోనగు వారంతరవర్ణులు. వారందఱిలోఁ బరస్పరము భోజనసంబంధములులేవు. వీరందఱు పంచమవర్ణులగు మాలమాదిగెలచే భూవ్యవసాయమ్ముఁ బనులను, పశుపాలనమును, జేయుచుందురు- కాని వారినిండ్ల దగ్గఱఁగ కాపురమునుంచరు. వారినంటరు. వారిని వేఱుస్థలె

ములలోఁ గొప్పముంచెదరు. ద్రావిడ కర్ణాటక మహా రాష్ట్ర ఘూర్జర గౌడాదులలోఁగూడ ననేక భిన్నములగు తెగలవారుగలరు. ఆంధ్ర క్షత్రియులలోఁ జాలమంది శూద్రాచారము నవలంబించిరి. వారి స్త్రీలలో ఘోషా యుండుటచే శూద్రులసేవ వారికావశ్యకము. ఆయుభయు లకు వ్యవసాయము సమానధర్మము. కన్యకాపరమేశ్వరిని కులదేవతగస్వీకరించి శ్రౌతస్మార్తకర్మములనువదలి యాంధ్ర వైశ్యులు పురాణాచారము లనవలంబించిరి. కాని కొందఱు మాత్రము పూర్వాచారము నవలంబించుచున్నారు. వారిని 'గౌరకోమటు' లందురు. కళింగకోమటులు నూతనులు. వారు గంజాంజిల్లాలోని యుత్తరభాగమున నున్నారు. కాని వారికి శ్రౌతస్మార్త కర్మములనుగుఱించిన జ్ఞానము శ్రద్ధయు లేదు. కావునదానివ్యాప్తిక్షీణించుచున్నది. పవిత్ర బ్రాహ్మ ణులకే యాకర్మములందు శ్రద్ధనశించుచున్నందున నితరవర్ణ లకుఁ జెప్పవలయునా? ఇప్పటి బ్రాహ్మణాది సర్వవర్ణము లలో వారి స్వధర్మములను వదలి ధాన్యసురాది క్రయవిక్ర యములు, సభలలో తప్పుడుసాక్ష్యమిచ్చువారు, అగ్రహా రాదులుగలవారు, వడ్డీలోనగు వర్తకముఁజేయువారు, పరిచార కులు, భూమిని సాగుచేయువారు, ముష్టినెత్తుకొనువారు, చౌర్యాది దుర్వృత్తులుగలవారు, నున్నారు. మొత్తమున సర్వ వర్ణులలోఁ జాలమంది వాణిజ్యాదిరూపమగు వైశ్యధర్మమును ద్రవ్యసంగ్రహాయత్నము నిప్పుడు విశేషముగఁ జేయుచు న్నారు. సర్వాశ్రమములు గృహస్థాశ్రమధర్మమును సామాన్య

ముగ నాచరించుచున్నారు. కృషి గోరక్షణము చేయుచుఁగ శూద్రులకున్నను బ్రాహ్మణ క్షత్రియులలోఁ జాలమంది, వైశ్యులలోఁ గొందఱుమాత్రమే, భూమిని సాగుఁజేయుచుఁ జేయించుచు దానివలననే జీవించుచున్నారు. కేవలమధ్యాపనయాజన ప్రతిగ్రహములవలన జీవించు బ్రాహ్మణులతి స్వల్పసంఖ్యాకులు. వేయిమందిలో నొకఁడైనను స్మార్త కర్మములగు వైశ్వదేవాదికములలోఁగొన్నిఁటినేనియు, చేయుటలేదు. పూర్వాచారపరాయణులగు బ్రాహ్మణాదులు పల్లెటూళ్ళలోను, బస్తీలలోను, పుణ్యతీర్థములలోను, క్షీణించుచున్నారు. సర్వులుసామాన్యముగ నర్థకామపరులై ప్రాచీన ధర్మవిముఖులగుచున్నారు. కాన మనదేశమున ననేక కాలారిష్టములు సంభవించినవి, ఇంకను రానున్నవి. మఱియును మన హిందూదేశములో బ్రాహ్మణాది సర్వవర్ణములలో నవాంతరవర్ణభేదములు 300 పైగానున్నవని జనాభాలెక్కవలనఁదేలినవి. దేశభాషలు పెక్కులుగలవు. అందఱు నార్యమతావలంబులై శ్రుత్యాదులను బ్రమాణములే నొప్పినను ననేకవేలయేండ్లనుండి భిన్నాచార పిశాచగ్రస్తులై యున్నారు. పూర్వకాలములోనే నాలుగువర్ణములు వానిసంకరములగు నను లోమప్రతిలోమ జాతులనేకములునున్నట్లు మన్వాదిస్మృతీతిహాస పురాణములు వివరించినవి. భారతయుద్ధకాలమున నుత్తరహిందూస్థానమున 156 తెగలవారును, దక్షిణమున 52 ను, ఉత్తరమునుండు నితరజాతీయులగు యవనాదులు 26 గురు నున్నట్లు భీష్మపర్వములో వర్ణింపఁబడియున్నది.

ఇప్పటికి వారునిక రెండింతలు గలరు. వీరిలోనుండు నార్యులు ప్రాచీనములగు నాలుగువర్ణములుగ మారినచో వారిలో నైకమత్యత హెచ్చి వారికిని, వారిసంతతివారికిని, వారి జన్మభూమియగు భారతమాతకును, సకలవిషయములలో శ్రేయోదాయకమగు. కాని యిది గొంతెమ్మకోరికయా! ఎప్పుడైననుసాధ్యమా! అను సంశయముమాత్రము దోఁచుచున్నది. కాని పరరాజులు మనకేలికలగుటచేతను, కావలసిన సౌఖ్యములు లేకపోవుటచేతను, మనదేశపు ద్రవ్యాదులనేకములుగ వారి దేశమునకును, నితరదేశములకును బోవుటచేతను, శిల్పపారిశ్రామికపుఁబనులు మనదేశమంతటను వృద్ధిఁజేసినఁగాని, మనకర్థవృద్ధి కానేరదు. కనుకను దానియార్జననిమిత్త మితరదేశములను నౌకావిమానముల మీద రాకపోకలగత్యము గానను, నిమ్నజాతులగు పంచమాదులయొక్కయు మన స్త్రీలయొక్కయు దురవస్థను మాన్పి వారిని బాగుచేయునిది మనకుఁ బురోభివృద్ధిగలుగదు గనుకను, దేశమందంతటను ప్రాథమిక విద్యావ్యాప్తి యత్యంతావశ్యకము గనుకను, మనదేశములోనున్న యార్యులకును, నితరమతస్థులకును, నైకమత్యమత్యావసరముగనుకను, స్వరాజ్యపాలనమునకు సమైక్యమత్యావశ్యకముగనుకను, మన ప్రాచీనధర్మములతిత్వరలో మారవలసినతరుణము వచ్చినదని తోచుచున్నది. ఇట్టి హేతుపుంజములచే వర్ణాశ్రమధర్మములు శ్రుతిస్మృత్యాదులలోఁ జెప్పఁబడినట్లిప్పుడాచరణములో లేక మారినవి. ఇంకను మారు

చున్నవి, మాఱినున్నవి. ఇప్పుడు సర్వవర్ణులు సామాన్యముగ నాచరించుఁ గర్మములలోను, నాచారములలోను, గొన్ని యధర్మములు కావనియు, ధర్మాభాసములనియు. స్పష్టముగ సరయునగు.

ఇతి శివం.

వావిలాల వేంకట శివావధాని.



# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 12 | మోాక్షను | మోాక్షము |
| 2 | 20 | వాయు | వాయ |
| 3 | 3 | జ్ఞానులును | జ్ఞానులును, |
| 3 | 6 | యూార్యావర్తన | యూార్యావర్త |
| 6 | 11 | (మను అ ౨-౧౬,-౨౨) | (మను అ 2-16,22) |
| 5 | 1 | యూాం దేశములున్న | యూామనదేశమగు |
| 5 | 4 | ౫,౬ | 5,6 |
| 5 | 10 | వింద్య | వింధ్య |
| 6 | 3 | నాగరకత | నాగరికత |
| 6 | 7 | పైనిచెప్పిన | పైనచెప్పిన |
| 6 | 9 | గౌతముడు | గౌతములు |
| 6 | 12 | నేటికని | నేఁటికిని |
| 7 | 4 | తోడలు | తొాడలు |
| 7 | 7 | దాత్పర్యము, | ఁదాత్పర్యము. |
| 7 | 8 | బురాణములలో | బురాణములలోఁ |
| 7 | 15 | ఛందోంధంతరగం | ఛందోరథంతరగం |
| 7 | 18 | సృజ్యతతిష్టు | సృజ్యతతిౖష్టు |
| 8 | 16 | పుట్టింపబడి | పుట్టింపఁబడి |
| 9 | 1 | స్తోమమును | స్తోమమును |
| 9 | 1 | విశ్వదేవును | విశ్వేదేవులు |
| 9 | 4 | ఏలననఁగా | ఏలయనఁగా |
| 9 | 6 | ఏలనన | ఏలయన |

| | | | |
|---|---|---|---|
| 9 | 15 | వలశసః | వలయునః |
| 9 | 15 | వీని 16 పఙ్క్తిలో-6 | వీని |
| 10 | 3 | అఃధకారావృతే | అంధకారావృతే |
| 10 | 16 | స్వయఃపేత్ | స్వయంభవేత్ |
| 10 | 20 | వర్ణానుపతిలోమేజాతో | వర్ణానుప్రతిలోమేనజాతో |
| 10 | 23 | కీర్తిత్తః | కీర్తితః |
| 11 | 22 | ప్రకీర్తిత్తః | ప్రకీర్తితః |
| 12 | 2 | వేదేహాఖ్య | వైదేహాఖ్య |
| 12 | 3 | వేల | బల |
| 12 | 12 | ప్రకీర్తిత్తః | ప్రకీర్తితః |
| 12 | 21 | రజకోజ్జేయః | రజకోజ్ఞేయః |
| 13 | 15 | జాతష్షర్ష్షోష | జస్తుష్షర్షహాష్షా |
| 14 | 4 | కురుడె | కురుతే |
| 14 | 18 | బేద్ | చేద్ |
| 15 | 8 | క॥ అనికరుణ | క॥ ‘‘అనికరుణ |
| 15 | 3 | పారీం | పారం |
| 15 | 8 | క॥ అనికరుణ | క॥ ‘‘అనికరుణ |
| 16 | 1 | లంగనలతోడనిఝించి | లంగనలతోడజనియించి |
| 16 | 4 | వ్యత్యయముతిలో | వ్యత్యయముప్రతిలో |
| 20 | 5 | ముక్తిబడ | ముక్తిఁబడ |
| 20 | 11 | అగ్నిదేవత | (అగ్నిదేవత |
| 21 | 2 | సిత్వా”.॥. | సిత్వా.॥. |
| 21 | 10 | శూద్రః. 15. | శూద్రః’’. 15. |
| 22 | 2 | (గీ 4 అ 1 శ్లో) | (గీ. 4 అ. 12 శ్లో) |

| | | | |
|---|---|---|---|
| 2 | 8 | వర్ణవిభాగముఁ | వర్ణవిభాగము |
| 2 | 10 | నుపచారకములుగ | నుపచారకములుగఁ |
| | 14 | ద్వీపములలోగూడ | ద్వీపములలోఁగూడ |
| 4 | 20 | ననువదించుటయేఁగాక | ననువదించుటయేగాక |
| 6 | 12 | ఒర్పు | ఓర్పు |
| 6 | 20 | జాతివావే | జాతివాగే |
| 7 | 11 | వాద | హృద |
| 8 | 22 | పుట | పుటలు)" |
| 9 | 3 | అక్కడచాల | అక్కడఁజాల |
| 9 | 10 | (Taltecs) | (Toltecs) |
| 9 | 11 | వైశ్యులార్యతో | వైశ్యులార్యులంతో |
| 9 | 23 | నార్యులే,. | నార్యులే." |
| 0 | 2 | ధర్మములకు | ధర్మములకుఁ |
| 0 | 16 | కారణము, | కారణము. |
| 1 | 20 | Peligree | Pedigree |
| 2 | 22 | లయినారు. విశ్వా | లయినారు. కానివిశ్వా |
| 3 | 1 | వచ్చినది. కాని | వచ్చినదికాని |
| 4 | 6 | వానసికౌశిక। | వాఁసికౌశిక। |
| 4 | 18 | బ్రిహ్మ | "బ్రిహ్మ |
| 5 | 6 | వరించుగాక,' | వరించుఁగాక |
| 38 | 6 | క్లేశములు, | క్లేశములు. |
| 0 | 11 | ఁదగదు. | ఁదగదు, |
| 3 | 3 | మును | ములను |
| 43 | 3 | నాఫలము | నాఫలముల |

| | | | |
|---|---|---|---|
| 43 | 4 | భక్తులతో జేసిన | భక్తులతోఁ సమర్పణ జేసిన |
| 45 | 20 | గర్భాదానాది | గర్భాధానాది |
| 46 | 7 | బ్రిహ్మలు | జన్మలు |
| 46 | 17 | తపము | తపము, |
| 48 | 22 | సతీర్థ | సతీర్థ |
| 49 | 8 | శుసత్వము | శుద్ధసత్వము |
| 51 | 3 | ఆశమా | ఆశ్రమా |
| 51 | 17 | నైష్ఠికుఁడు | నైష్ఠికుఁడు, |
| 52 | 7 | ఁబుచ్చు | ఁబుచ్చి |
| 54 | 11 | వరా | వర్ణా |
| 56 | 18 | నాదేశస్థులు | నాదేశపురుషులు |
| 58 | 3 | వర్ణాశ్రిమాభాసములు | వర్ణాశ్రమధర్మాభాసములు |
| 58 | 20 | దెలిపి | ఁదెలిసి |
| 59 | 22 | ష్టాంద్రా | ష్టాంధ్రా |
| 60 | 13 | మన్నది | మున్నదేము |
| 63 | 21 | లోని | లో, ని |
| 64 | 2 | లో | లో, |
| 65 | 2 | ర్య | ర్యను |
| 67 | 4 | యో్య | యో |
| 67 | 17 | నాచారు | భిన్నాచారు |
| 69 | 2 | దురిలకున్న | మురిలు |
| 69 | 2 | మంది | మంది ము, |

—౦—